శ్రీః
మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్

# కుమారసమ్భవమహాకావ్యమ్

రామోరావిరచితమృణాళినీవ్యాఖ్యాసహితమ్
వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా చ సముల్లసితమ్
సప్తమః సర్గః



రావి మోహనరావు, M.Sc., M.A. (Sanskrit)
లెక్చరర్
4-103, I.L.T.D. Colony Extn., Kothapet, CHIRALA-523157



శ్రీః
మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్
కుమారసమ్భవమహాకావ్యమ్
రామోరావిరచిత మృణాళినీవ్యాఖ్యా సహితమ్
వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా చ సముల్లసితమ్
సప్తమః సర్గః

ప్రథమ ముద్రణ: **18-12-2012**
ప్రతులు : **500**
పేజీలు : **272**
వెల రూ. : **150.00**


Lecturer, V.R.S. & Y.R.N. College, Chirala-523157

**Residence:**
4-103, I.L.T.D. Colony Extn.,
Kothapet, CHIRALA - 523157
Cell :**94401 15411, 9052256311, 08594 - 234038**

D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

**శ్రీః**

## కాళిదాస కవితలో కమనీయ కల్యాణఘట్టము

మహాకవి కాళిదాసు గొప్పదనమునుగురించి ప్రాచీన విమర్శకులు అనేకులు అనేక విధములుగ కొనియాడిరి. అందు ప్రముఖమైనవి –

1. ఉపమా కాళిదాసస్య భారవేరర్థగౌరవమ్।
   దండినః పదలాలిత్యం మాఘే సన్తి త్రయో గుణాః॥
2. పురా కవీనాం గణనాప్రసఙ్గే కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా।
   అద్యాపి తత్తుల్యకవేరభావాత్ అనామికా సార్థవతీ బభూవ॥
3. కవిర్దండీ కవిర్దండీ భవభూతిస్తు పణ్డితః।
   కోఽహం రణ్డే త్వమేవాహం త్వమేవాహం న సంశయః॥
4. కవయః కాళిదాసాద్యాః కవయో వయమప్యమీ।
   పర్వతే పరమాణౌ చ పదార్థత్వం వ్యవస్థితమ్॥
5. కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకున్తలా।
   తత్రాపి చ చతుర్థోఽఙ్కః తత్ర శ్లోకచతుష్టయమ్॥

ఈవిధముగ కాళిదాసును ప్రశంసించుట మాత్రమే కాక సంస్కృత పఞ్చమహాకావ్యములలో కాళిదాసు రచియించిన మూడు శ్రవ్యకావ్యములను ముందుగ చేర్చిరి. దీనితోనే సంస్కృతభాషలో కాళిదాస మహాకవికి గల స్థానమేమిటో సుస్పష్టముగ తెలియుచున్నది.

అందువలననే సంస్కృతభాషను నేర్చుకోవాలని అనుకునేవారు కాళిదాస గ్రంథాలలో కనీసం ఏ ఒక్క గ్రన్థాన్నైనా తప్పక చదువుతారు. కాళిదాసును ఎఱుగని సంస్కృతజ్ఞులు ఉండరు.

కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే।
సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే॥

అని కావ్యమునకు గల ప్రయోజనములను వివరించినారు. అందులో మొదటిది కీర్తి. ఆ కీర్తిని బాగుగ సాధించిన కవి కాళిదాస మహాకవి. అయితే ఆ మహాకవి కూడా కొందరు కవుల కీర్తితో స్ఫూర్తి పొందినట్లు –

మందః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్।
ప్రాంశులభ్యే ఫలే లోభాత్ ఉద్బాహురివ వామనః॥

అను శ్లోకము ద్వారా తెలియుచున్నది. కాని ఆ కవులు ఎవరో మనకు తెలియదు.





బహుశః కాళిదాస కీర్తిలో వారి కీర్తి మరుగున పడిపోయి ఉండవచ్చును.

యశసి చాభిరుచిః వ్యసనం శ్రుతౌ।
ప్రకృతిసిద్ధమిదం హి మహాత్మనామ్॥

అని భర్తృహరి మహాకవి తన నీతిశతకంలో చెప్పినారు. కీర్తికాంక్ష అనునది ఉండవలసిన కాంక్ష అనియు, అది మహాత్ములకు సహజసిద్ధమైనదియు అనియు అన్నారు.

అయితే ఎట్టివారికైనను సమకాలీనులలో మాత్రం కొంతమంది అసూయాపరులు తప్పక ఉంటారు. అందువలననే కాళిదాసు కూడా మేఘసందేశంలో తనను విమర్శించే దిఙ్నాగుడు మొదలైనవారిని పరోక్షంగా నిరసించాడని పెద్దలు చెబుతూ ఉంటారు.

కాళిదాసు అంతటి కీర్తి కలవాడు కనుకనే ఆయన గ్రంథములను వ్యాఖ్యానము చేయుటద్వారా మల్లినాథపండితుడు కూడా గొప్ప కీర్తిని సంపాదించినాడు. ఎందువల్లననగా మల్లినాథుడు ఎంతటి మహాపండితుడైనను కాళిదాస గ్రంథములకు వ్యాఖ్యానములను రచియించనియెడల ఇంతటి పేరు ప్రతిష్ఠలను ఆర్జించెడివాడు కాడు అనునది నిస్సందేహవిషయము. అట్లే మరికొందరు కాళిదాస గ్రంథములకు అనువాదము చేయుటద్వారా, మరికొందరు ప్రతిపదార్థతాత్పర్యములను వ్రాయుటద్వారా, మరికొందరు కాళిదాసగ్రంథములను ముద్రించుట ద్వారా సంస్కృతసాహిత్యచరిత్రలో తమ స్థానాన్ని సుస్థిరం చేసుకోవాలని ప్రయత్నిస్తూ ఉన్నారు. సంస్కృతగ్రంథముద్రణలో 'వావిళ్ల' వారికి గల స్థానము సైతము కాళిదాస గ్రంథ ముద్రణముతో లభించినదే! కాళిదాస గ్రంథములను ముద్రించనియెడల వారి పేరు మనకు తెలిసి ఉండెడిది కాదు.

**'పుష్పమాలానుషంగేణ సూత్రం శిరసి ధార్యతే'** అని గదా పెద్దల వచనము. ప్రకృతములో శ్రీరావి మోహనరావుగారు సైతము ఇప్పటికే ఎన్నో గ్రంథములు ముద్రణ చేసి తనివి తీరక కాళిదాస గ్రంథములను ఇతర వ్యాఖ్యానములన్నింటిని తాను పరిశీలించి తనదైన శైలిలో ప్రతిపదార్థతాత్పర్యములను, సంధులను, సమాసములను వివరించుచూ ఒక పరిశోధనాత్మక గ్రంథముగాను, విద్యార్థులకు ప్రాథమిక గ్రంథముగాను ఉండేటట్లుగ విలక్షణముగ తయారుచేసి స్వయముగ ముద్రణచేసి అందించుచున్నారు. కావున కాళిదాస గ్రంథములతో పాటు వీరు కూడా కీర్తిప్రతిష్ఠలను శాశ్వతంగా పొందాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.

## కుమార సంభవము – సప్తమసర్గ

**జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ॥**

అంటూ కాళిదాసు పార్వతీపరమేశ్వరులయెడల తన భక్తిని ప్రదర్శించినాడు. ఆయన

వ్రాసిన ప్రతి గ్రంథములో పరమేశ్వర ప్రస్తావన తప్పక ఉంటుంది. ఇక కుమారసంభవము సంపూర్ణముగ శివపురాణమే : అందువలననే ఇక్కడ శివపార్వతుల చరిత్రను పూర్తిగా నిబంధించినాడు. ఈ కావ్యములో ఏడవ సర్గ పార్వతీపరమేశ్వరుల వివాహమునకు సంబంధించినది. యాదృచ్ఛికమో లేక కవి ఉద్దేశ్యపూర్వకముగ నిబంధించినాడో కాని రఘువంశములోని ఏడవసర్గ కూడా అజుడు ఇందుమతి కళ్యాణమునకు సంబంధించినదియే.

**పశుపతి రపి తాన్యహాని కృచ్ఛ్రాదగమయత్ అద్రిసుతాసమాగమోత్కః**

హిమవంతుడు వివాహముహూర్తవిషయమై మహర్షులను ప్రశ్నించగా వారు మూడుదినముల యనంతరమని ముహూర్తనిర్ణయమును తెల్పి హిమవంతునినుండి సెలవు తీసికొని పరమేశ్వరుని వద్దకు వెళ్ళి జరిగిన విషయమును ఆయనకు తెలిపిరి. పరమేశ్వరుడు కూడా గౌరీ సమాగమముకొరకు ఆతురత పడుచు ఆ మూడు దినములను అతి కష్టముమీద గడిపెను, అని కాళిదాసు వర్ణించెను.

అట్టి వివాహసమయములో మొదటిసారిగ పార్వతీదేవి పాణిని పరమేశ్వరుడు స్పృశించగా

**రోమోద్గమః ప్రాదురభూదుమాయాః స్విన్నాంగులిః పుంగవకేతురాసీత్**

పార్వతీదేవికి రోమాంచములు ఏర్పడెనట. పరమేశ్వరుని హస్తమునందు స్వేదము ఉద్భవించెనట. ఇట్టి వర్ణనలనుగురించి చదివినప్పుడు కామదహనము చేసిన పరమేశ్వరునకు కూడా ఇట్టి భావములు నిజముగా ఉండునా, లేక కవివర్ణన మాత్రమేనా అని సందేహము కలుగక మానదు.

ఇచట మనం రెండు సమాధానములను చెప్పుకోవచ్చును. అందు మొదటిది.–

ఎంతటి పార్వతీపరమేశ్వరులైనను ప్రస్తుతము వారు నూతనవధూవరులు కాన వారి భావములు నూతనవధూవరులకు తగినట్లుగానే యుండుననియు, అట్లే కవి, వర్ణించవలసియుండుననియు మనము భావింపవలయును.

ఇక రెండవ సమాధానమేమనగా–

**నానృషిః కురుతే కావ్యమ్**. ఋషికాని వాడు కావ్యమును వ్రాయలేడు. అందులోను కాళిదాసు సామాన్య కవికాడు. పార్వతీపరమేశ్వరులయెడల అత్యంత భక్తి ప్రవృత్తులు కలవాడు. కవికులగురువు. ఆయన కవిత్వమే కాళికాదేవి వరప్రసాదలభ్యము.

దాదాపు ఆయన కవిత్వము ఆయన ముఖము ద్వారా వచ్చిన కాళికాదేవి రచనగా భావింపవలెను. అందువలన పరమేశ్వరుడు మూడుదినములను అతికష్టము మీద





గడపెను అన్నా, ప్రథమసమాగమమున ఆయన చేతికి చెమటలు పట్టినవి అన్నా అది అంతయును వాస్తవము అనియే భావింపవలెను. కవివర్ణనగా పరిగణించ వలసిన అవసరము లేదు.

సహజముగ నూతన వధూవరులను చూచుటయందు జనులకు ఆసక్తి మెండు. వారు అంతకు ముందు బాగా పరిచితులైనను వివాహసమయమందు ప్రత్యేకించి చూడటానికి ఆసక్తి చూపిస్తారు. ఈ విషయంలో స్త్రీలు క్రొత్త పెళ్ళికొడుకును చూడటానికి మరింతగా ఉత్సాహం చూపిస్తారు. దానికి కారణం ఏమనగా వివాహ సమయంలో నూతన వధూవరులలో పార్వతీపరమేశ్వరులు ప్రవేశిస్తారని వేదం చెబుతోంది. అందువలన వారికి క్రొత్త కళ వస్తుంది. అందువలననే వారిని చూడటానికి అందరూ ముందుకు వస్తారు. అయితే ఇక్కడ సాక్షాత్తుగా పార్వతీ పరమేశ్వరులే వధూవరులైనందున వారి శోభ విషయమై చెప్పెడిది ఏమి ఉన్నది?

వివాహార్థము పెండ్లికూతురి ఇంటికి వచ్చుచున్న పరమేశ్వరుని చూచుటకు మార్గములోని భవనములలోనున్న స్త్రీలు ఎంతటి ఆసక్తి చూపించారో అనే విషయాన్ని కాళిదాసు చాలా రమణీయంగా వర్ణించాడు. అయితే, ఈ సందర్భంలో అజ ఇందుమతుల వివాహసమయంలో రఘువంశములో కూడా కాళిదాసు ఇట్లే వర్ణించినాడు. రెండు సందర్భములలోనూ కొన్ని శ్లోకములు అక్కడ, ఇక్కడ ఏకవిధముగ నున్నవి. తన కావ్యములోని కొన్ని శ్లోకములనే తనే మరియొక కావ్యములో సైతము ఉంచినాడంటే అవి ఆ కవినే ఎంత ఆకర్షించినవో తెలియు చున్నది.

లేదా ఒకచోట ఉన్నవాటిని మరియొక చోటకూడా ఎవరో ప్రక్షిప్తము చేసినారంటే పాఠకులకు ఆ శ్లోకములయందు ఎంతటి అభిమానము ఉన్నదో తెలియుచున్నది.

మొత్తము మీద ఏ కవియైనా ఏదైనా ఒక వివాహఘట్టమును వర్ణించవలెనన్న ఇంతకన్నా గొప్పగా వర్ణించుట అసాధ్యము అన్న విషయం దృఢముగ తెలియుచున్నది.

ఇక పార్వతీపరమేశ్వరకల్యాణవిషయంలో కాళిదాసు ఎన్నో భారతీయ ఆచారములను ఇందు తెలియజేసినాడు.

ఈ గ్రంథమును, గ్రంథములోని ఈ కల్యాణసన్నివేశమును చదువుట ద్వారా పాఠకులు ఇహపరములు రెండింటిని తప్పక పొందగలరు అని నా విశ్వాసము.

ఇట్లాంటి గ్రంథాన్ని పాఠకలోకానికి అందించిన మిత్రులు శ్రీరావి మోహనారావుగారు ధన్యులు. వారికి పార్వతీ పరమేశ్వరుల అనుగ్రహం సర్వదా లభించాలని మనసారా ఆశిస్తూ –

డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రి



పుష్పగిరి పీఠాధిపతులు

శ్రీశ్రీశ్రీ విద్యానృసింహభారతీస్వామివారి

పాదపద్మములకు భక్తితో సమర్పితము.

– రామోరా





శ్రీః

ఓం కుమార శ్రీగురవే నమః



## మృణాళినీ వ్యాఖ్యానమున

ఉదాహరింపబడిన విషయములకు సంబంధించిన

ఆయా గ్రంథ రచయితలకు, వ్యాఖ్యానకారులకు నమస్సుమాంజలులు.

❊

ఇట సహకరించిన డా॥ పుయ్యూరు లక్ష్మీనరసింహారావుగారు,

డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగారు, డి. పాపిరెడ్డిగారు, సి. సుబ్బారావుగారు,

మేళ్లచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, శ్రీ ఇప్పగుంట సాయిబాబాగారు,

డా॥ గోగినేని యోగప్రభావతీదేవిగారు, మహామహోపాధ్యాయ శ్రీ పుల్లెల

శ్రీరామచంద్రుదుగార్లకు మఱియు అడిగిన వెంటనే 'కాళిదాస కవితలో

'కమనీయకల్యాణఘట్టము' అందించిన

డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రిగారు,

డా॥ కందాళ లక్ష్మీనారాయణగారు, గరిమెళ్ళ సోమయాజులుశర్మగారు,

ప్రియమిత్రులు శ్రీ కె. అరవిందరావు గార్లకు

❊

నా ఆరాధ్యదైవమైన

మహాయోగి శ్రీఅరవిందభగవానుదు,

వారి అర్ధభాగమైన మృణాళినీదేవికి నమస్కరిస్తూ.....

❊

శ్లో॥ నాహం మనేయ సువేదేతి – నో న వేదేతి వేద చ।

యో నస్ తద్వేద తద్వేద – నో న వేదేతి వేద చ॥

– కేనోపనిషత్ 10

ఓం శాన్తిశ్ శాన్తిశ్ శాన్తిః

**– రా మో రా**

శ్రీః

మహాకవి శ్రీకాళిదాసవిరచితమ్

# కుమారసమ్భవమహాకావ్యమ్

## ఉమాపరిణయో నామ సప్తమః సర్గః

### రామోరా విరచిత -
### ఆన్ధ్రమృణాళినీవ్యాఖ్యాసముల్లసితమ్

---

**అవతారిక :–** సప్తర్షీణాం గమనానన్తరం హిమవాన్ శుభతిథౌ ఉమాయాః వివాహదీక్షావిధిమకరోత్–

**శ్లో॥ అథౌషధీనామధిపస్య వృద్ధౌ**
**తిథౌ చ జ్యామిత్రగుణాన్వితాయామ్।**
**సమేతబన్ధుర్హిమవాన్సుతాయా**
**వివాహదీక్షావిధిమన్వతిష్ఠత్॥** **1**

**పదవిభాగము :–** అథ, ఓషధీనామ్ అధిపస్య, వృద్ధౌ, తిథౌ, చ, జ్యామిత్రగుణాన్వితాయామ్, సమేతబన్ధుః, హిమవాన్, సుతాయాః, వివాహదీక్షావిధిమ్, అన్వతిష్ఠత్।

**అన్వయము :–** అథ హిమవాన్ ఓషధీనామధిపస్య వృద్ధౌ తిథౌ చ జ్యామిత్రగుణాన్వితాయామ్ (సత్యామ్) సమేతబన్ధుః (సన్) సుతాయాః వివాహదీక్షావిధిమ్ అన్వతిష్ఠత్।





**ప్రతిపదార్థము :–** అథ – పిమ్మట (సప్తర్షులు పెట్టిన గడువగు మూడురోజుల అనంతరము), హిమవాన్ – హిమవంతుడు, ఓషధీనామ్ అధిపస్య వృద్ధౌ – ఓషధులకు భర్తయగు చంద్రుడు దినదినాభివృద్ధిగాంచు శుక్లపక్షమునందు, జ్యామిత్రగుణాన్వితాయామ్ తిథౌ చ – జ్యామిత్రగుణాన్వితమైన తిథియందును, సమేతబన్ధు ః – బంధుగణముతో కూడినవాడై, సుతాయాః – తన కూతురగు పార్వతీదేవికి, వివాహదీక్షావిధిమ్ – వివాహదీక్షావిధిని – పరిణయసంస్కార విధానమును, అన్వతిష్ఠత్ – నిర్వహించెను.

**తాత్పర్యము :–** పూర్వసర్గమున సప్తర్షులు పెట్టిన గడువగు మూడురోజుల అనంతరము హిమవంతుడు – చంద్రుడు దినదినాభివృద్ధిగాంచు శుక్లపక్షమునందు, జ్యామిత్రగుణాన్వితమైన తిథియందును – బంధుగణముతో కూడినవాడై తన కూతురగు పార్వతీదేవికి వివాహదీక్షావిధిని నిర్వహించెను.

**విభక్తులు/క్రియలు :–** 1. అథ – అవ్యయము, 2. హిమవాన్ – **హిమవాన్**, హిమవన్తౌ , హిమవన్తః, తకారాన్తః పుంలింగ హిమవచ్ఛబ్దః; ప్రథమావిభక్తి ఏకవచనము. 3. అధిపస్య – **అధిపస్య,** అధిపయోః, అధిపానామ్; అకారాన్త పుంలింగ అధిపశబ్దము – షష్ఠీవిభక్తి ఏకవచనము. 4. జ్యామిత్రగుణాన్వితాయామ్ – **...అన్వితాయామ్,** ...అన్వితయోః, ... అన్వితాసు; ఆకారాన్త స్త్రీలింగ ...అన్వితాశబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 5. వృద్ధౌ – **వృద్ధౌ** , వృద్ధ్యోః, వృద్ధిషు; ఇకారాన్త స్త్రీలింగ వృద్ధిశబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 6. తిథౌ – **తిథౌ,** తిథ్యోః, తిథిషు; ఇకారాన్త స్త్రీలింగ తిథిశబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 7. చ – అవ్యయము. 8. సమేతబన్ధుః – **...బన్ధుః** బన్ధూ, బన్ధవః; ఉకారాన్త పుంలింగ బన్ధుశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 9. సుతాయాః – సుతాయాః, సుతయోః, సుతానామ్; ఆకారాన్త స్త్రీలింగ సుతాశబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 10. వివాహదీక్షావిధిమ్ – **...విధిమ్,** ...విధీ, ...విధీన్; ఇకారాన్త పుంలింగ ...విధిశబ్దము; ద్వితీయావిభక్తి ఏకవచనము. 11. అన్వతిష్ఠత్ – క్రియ – లఙ్ – ప్రథమ పురుషైకవచనము.

**సంధులు :–**

1. అథ + ఓషధీనామ్... = అథౌషధీనామ్... – వృద్ధిసంధిః। **వృద్ధిరేచి** (సూ 6–1–85) – అవర్ణమునకు (అఆలకు) ఏఓఐఔలు పరమగునపుడు పూర్వపరముల స్థానములో వృద్ధి ఏకాదేశమగును. ఏఐలు పరమగునపుడు ఐకారము, ఓఔలు పరమగునపుడు ఔకారము వచ్చును.
2. సమేతబన్ధుః + హిమవాన్ – సమేతబన్ధుర్హిమవాన్ – విసర్గసన్ధిః।
3. అన్వతిష్ఠత్ – అను + అతిష్ఠత్ – అన్వతిష్ఠత్ – యణాదేశసన్ధిః – **ఇకోయణచి** (సూ 6–1–74) – ఇఉఋఌ వర్ణములకు అసవర్ణమైన అచ్చుపరముగా నున్నప్పుడు క్రమముగా య్ వ్ ర్ ల్ (యణ్) అనునవి ఆదేశమగును.

**సమాసాలు / విగ్రహవాక్యాలు :-**

1. హిమవాన్ – హిమాని సన్తి యస్య స హిమవాన్ – మతుప్ ప్రత్యయః। తద్ధితవృత్తిః।
2. అధిపస్య – అధి పాతీతి అధిపః, తస్య అధిపస్య। అవ్యయీభావసమాసః।
3. జ్యామిత్రగుణాన్వితాయామ్ – జ్యామిత్రస్య గుణః జ్యామిత్రగుణః తేన అన్వితా జ్యామిత్రగుణాన్వితా, తస్యాం జ్యామిత్రగుణాన్వితాయామ్ – తృతీయా తత్పురుషసమాసః।
4. సమేతబన్ధుః – సమేతాః బన్ధవః యస్య స సమేతబన్ధుః – బహువ్రీహిః।
5. వివాహదీక్షావిధిమ్ – వివాహస్య దీక్షా వివాహదీక్షా సా ఏవ విధిః వివాహదీక్షావిధిః , తమ్। కర్మధారయసమాసః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

**1. జ్యామిత్రగుణాన్వితాయామ్ –**

**ఎ)** "ఉదగయన ఆపూర్యమాణపక్షే కల్యాణే నక్షత్రే చౌలకర్మోపనయన గోదాన వివాహాః" – చౌలోపనయన, గోదాన, వివాహాది శుభకర్మలు శుక్లపక్షమునందు చేయదగినవి అని – ఆశ్వలాయనగృహ్యసూత్రము (1–4–1) నందు చెప్పబడినది. 'సార్వకాలమేకే వివాహమ్' (14–2) ఇత్యాశ్వలాయనగృహ్యే। జాతకచక్రమునందు లగ్నమునుండి సప్తమస్థానమును జామిత్రస్థానమందురు.

ముహూర్తదర్శనే – 'జామిత్రాస్తకలత్రమన్మథమదద్యూనాభిధం సప్తమమ్' ఇతి। తస్య గుణస్తు గ్రహరహితత్వమ్।

సుబోధే – 'శుద్ధో భవేత్ సప్తమః' ఇతి।

జామిత్రస్థానము శుద్ధమైయున్నచో పెండ్లి శుభప్రదమగునని అరుంధతీసమేత ఋషిగణము ముహూర్తమును నిర్ణయించిరని తలంపవచ్చును.

'జామిత్రం లగ్నాత్ సప్తమమ్ స్థానమ్' – అని మల్లినాథుడు.

Some Derive the Word from 'జాయా' because in astrology, the జామిత్ర sign indicates the future good luck of one's wife (జాయామిత్రమ్;) but the word is obviously connected with the Greek 'Diametron' - Apte.





ఇందు 'జా' అను అక్షరము సార్థకమై, శివపార్వతుల కల్యాణము జరిగి 'కుమారజన్మము'ను సూచించుచున్నదని తలంపవచ్చును.

పతిర్జాయాం ప్రవిశతి గర్భో భూత్వేహ మాతరమ్।

తస్యాం పునర్నవో భూత్వా దశమే మాసి జాయతే।

**తజ్జాయా జాయా** భవతి యదస్యాం జాయతే పునః। అని శ్రుతి.

**బి) అన్వితా –** 1. అన్వితః – అ – త్రి – యుక్తః – సర్వశబ్దే

3. శ్లో॥ యా కున్దేన్దుతుషారహారధవళా యా శుభ్రవ**స్త్రాన్వితా**
యా వీణావరదణ్డమణ్డితకరా యా శ్వేతపద్మాసనా।
యా బ్రహ్మాచ్యుతశంకరప్రభృతిభిర్దేవైస్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా॥

ఇది వాగ్దేవీస్తోత్రము. ఈ శ్లోక పూర్తి వ్యాఖ్య కొఱకు 'మహనీయుడు 'విశ్వనాథ సత్యనారాయణ' గారి **'సాహిత్యసురభి'** చూడగలరు.

**ఛన్దస్సు :-** ఈ సర్గమున శ్లోకములన్నియు ఉపజాతి వృత్తమునందు నిబంధింపబడినవి.

**క్రియాదర్శము :-** అన్వతిష్ఠత్ – అను ఉపసర్గ, ష్ఠా (స్థా) గతి నివృత్తౌ నిలుచుట, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లజ్ ప్రథమపురుషైకవచనాన్తః।

**అన్వతిష్ఠత్ –** అన్వతిష్ఠతామ్ – అన్వతిష్ఠన్.

---

**అవతారిక –** హిమవతః నగరే ప్రతిగృహం స్త్రియః ప్రీత్యా మంగళపదార్థ సంపాదనవ్యగ్రా అభూవన్–

**శ్లో॥ వైవాహికైర్మఙ్గలసంవిధానై-**
**ర్గృహే గృహే వ్యగ్రపురంధ్రివర్గమ్।**
**ఆసీత్పురం సానుమతోఽనురాగా-**
**దన్తఃపురం చైకకులోపమేయమ్॥** 2

**పదవిభాగము :-** వైవాహికైః, మంగలసంవిధానైః, గృహే గృహే, వ్యగ్రపురంధ్రివర్గమ్, ఆసీత్, పురమ్, సానుమతః, అనురాగాత్, అన్తఃపురమ్, చ, ఏకకులోపమేయమ్।

**అన్వయము :–** అనురాగాత్ గృహే గృహే వైవాహికైః మంగలవిధానైః వ్యగ్రపురంధ్రివర్గం సానుమతః పురమ్ అన్తఃపురం చ ఏకకులోపమేయమ్ ఆసీత్।

**ప్రతిపదార్థము :–** అనురాగాత్ – కూరిమితో, గృహే గృహే – ప్రతి ఇంటియందును, వైవాహికైః – వివాహమునకు సంబంధించినవగు, మంగలసంవిధానైః – శుభమును కలిగించు ద్రవ్యాంగములతో, వ్యగ్రపురంధ్రివర్గమ్ – వ్యాసక్త గృహిణీ సమూహమును, సానుమతః – హిమాలయముయొక్క, పురమ్ – నగరమును, అన్తఃపురఇ్చ – అన్తఃపురమున్ను, ఏకకులోపమేయమ్ – ఒకే ఇంటితో పోల్చబడదగినదిగా, ఆసీత్ – ఆయెను.

**తాత్పర్యము :–** కూరిమితో ప్రతి ఇంటియందును వివాహమునకు సంబంధించినవగు శుభమును కలిగించు ద్రవ్యాంగములతో వ్యాసక్త గృహిణీ సమూహమును, హిమవన్నగరమును, అన్తఃపురమును ఒకే ఇంటితో పోల్చబడినదిగా ఆయెను. (అనగా హిమవంతుని మీది అభిమానముతో ఓషధిప్రస్థపురములో వారు వీరు అనక ప్రతి ఇంటిలోను వారు ఒకే కుటుంబసభ్యులవలె శివపార్వతుల కల్యాణకార్యమును నిర్వహింపమొదలిడినారని భావము)

**పాఠాన్తరాలు :–** 1. మంగల... – కౌతుక... ।

**విభక్తులు , క్రియలు :–** 1. అనురాగాత్ – **అనురాగాత్,** అనురాగాభ్యామ్, అనురాగేభ్యః; అకారాన్త పుంలింగ అనురాగశబ్దః, పఞ్చమీ ఏకవచనము. 2. గృహే – **గృహే,** గృహయోః, గృహేషు; అకారాన్తః నపుంసకలిఙ్గః గృహశబ్దః, సప్తమీ ఏకవచనము. 3. వైవాహికైః – వైవాహికేన, వైవాహికాభ్యామ్, **వైవాహికైః;** అకారాన్తః నపుంసకలింగః వైవాహికశబ్దః, తృతీయా బహువచనమ్. 4. మంగలసంవిధానైః – ...సంవిధానేన, ...సంవిధానాభ్యామ్, **...సంవిధానైః;** అకారాన్తః నపుంసకలింగః, ...సంవిధానశబ్దః తృతీయా బహువచనము. 5. వ్యగ్రపురంధ్రివర్గమ్ – **...వర్గమ్,** ...వర్గే, ...వర్గాణి; అకారాన్తః నపుంసకలిఙ్గః... వర్గశబ్దః ద్వి.ఏ. 6. సానుమతః – **సానుమతః,** సానుమతోః, సానుమతామ్; తకారాన్తః పుంలింగః సానుమచ్ఛబ్దః, షష్ఠ్యేకవచనాంతః 7. అన్తఃపురమ్ – **అన్తఃపురమ్,** అన్తఃపురే, అన్తఃపురాణి; అకారాన్తనపుంసకలిఙ్గ అన్తఃపురశబ్దః, ద్వి.ఏ. 8. చ – అవ్యయము 9. ఏకకులోపమేయమ్ – **...ఉపమేయమ్,** ...ఉపమేయే, ...ఉపమేయాని; అకారాన్తః నపుంసకలిఙ్గః, ...ఉపమేయశబ్దః, ప్ర.ఏ.

**సంధులు :–**

1. వైవాహికైః + మంగలసంవిధానైః – వైవాహికైర్మంగలసంవిధానైః – విసర్గసన్ధిః
2. ...సంవిధానైః + గృహే – ...సంవిధానైర్గృహే – విసర్గసన్ధిః।



3. సానుమతః + అనురాగాత్ – సానుమతోఽనురాగాత్ – ఉత్వాదేశః। **అతోరోరప్లుతాదప్లుతే,** (సూ 6–1–109) – అప్లుతమగు హ్రస్వ అకారమునకు పరముగానున్న రుత్వమునకు అప్లుతమైన హ్రస్వ అకారము పరముగా నున్నపుడు ఉకారము వచ్చును. పిదప పూర్వరూపము. (రుత్వాదేశము – ఉత్వాదేశము – గుణము – పూర్వరూపము)
4. చ + ఏక ... – చైక... – వృద్ధిసన్ధిః – వృద్ధిరేచి (సూ 6–1–85)

**సమాసాలు :–**

1. వైవాహికైః – వివాహః ప్రయోజనం యేషాం తాని వైవాహికాని, తైః వైవాహికైః **'ప్రయోజనం'** ఇతి ఠక్ ప్రత్యయం। **'కితి చ'** ఇతి ఆదివృద్ధిః।
2. మంగలసంవిధానైః – మంగలానాం సంవిధానాని మంగలసంవిధానాని, తైః మంగలసంవిధానైః। ష.త।
3. వ్యగ్రపురంధ్రివర్గమ్ – పురంధ్రీణాం వర్గః, పురంధ్రివర్గః వ్యగ్రః, వ్యగ్రపురంధ్రివర్గః యస్మిన్ తద్। వ్యగ్రపురంధ్రివర్గమ్– బహువ్రీహిః।
4. సానవః అస్య సన్తి ఇతి సానుమాన్, తస్య సానుమతః, తస్య సానుమతః తద్ధితవృత్తిః।
5. ఏకకులోపమేయమ్ – ఏకం చ తత్ కులమ్ ఏకకులమ్ తేన ఉపమేయమ్ ఏకకులోపమేయమ్ – తృ.త.।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. మంగలమ్ – (త్రి.)**

ఎ) మఙ్గతి హితార్థం సర్పతి, మఙ్గతి దురదృష్టమనేనాస్మాద్వేతి। మగి + **'మఙ్గేరలచ్'** ఇత్యలచ్। ఉణాదిసూత్రమ్।

బి)1. '...కల్యాణం మఙ్గలం క్షేమం శాతం శర్మ శివం శుభమ్'
– ఇతి వైద్యకరత్నమాలాయామ్।

2. 'కౌతూహలే మఙ్గలే చ కౌతకం స్యాద్' – ఇతి **భోజః।**

**సి)** 1. 'మంగలాయ చ లోకానాం క్షేమాయ చ భవాయ చ'
– ఇతి భాగవతే (5–14–34)

2. శ్లో॥ జనకానాం రఘూణాం చ యత్కృత్స్నం గోత్ర**మఙ్గలమ్।**
తస్మిన్నకరుణే పాపే వృథా వః కరుణా మయి॥
– ఇతి ఉత్తరరామచరితే – షష్ఠేఽఙ్కే – 42

3. శ్లో॥ మంగళం గురుదేవాయ మహనీయగుణాత్మనే।
సర్వలోకశరణ్యాయ సాధురూపాయ మంగళమ్॥ – గీతామాహాత్మ్యం

**అలంకారాలు :–** ఇందు 'ఉపమాలంకార'మున్నదని చెప్పదగును.

"ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః"। – అని చంద్రాలోకలక్షణము.

'ఉపమానమునకు ఉపమేయమునకు – ఈ రెండింటికి సామ్యరూపమైన సౌందర్యము సహృదయరంజకముగా నెచట నుండునో, అచట నది ఉపమాలంకార మగునని లక్షణము' – చంద్రాలోకసమున్మేషము.

"వ్యగ్రపురంధ్రివర్గమ్, పురమ్, అన్తఃపురమ్" – ఇది అంతయు 'ఏకకులోపమేయమ్' అని వర్ణింపబడుటచే నిది 'ఉపమాలంకార'మని చెప్పదగును.

**క్రియాదర్శము :– ఆసీత్ –** అస (అస్) భువి (ఉండుట), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లఙ్ – ప్రథమపురుషైకవచనాన్తః।

**ఆసీత్ –** ఆస్తామ్ – ఆసన్.

శ్లో॥ ప్రముదితవరపక్షమేకతస్తత్
క్షితిపతిమణ్డలమన్యతో వితానమ్।
ఉషసి సర ఇవ ప్రఫుల్లపద్మం
కుముదవనప్రతిపన్ననిద్ర**మాసీత్॥**
రఘువంశమహాకావ్యే –షష్ఠసర్గే – 86

---

**అవతారిక :–** రాజమార్గః తోర్ణైః పతాకాభిశ్చాలంకృతః –

**శ్లో॥ సన్తానకాకీర్ణమహాపథం త –
చ్చీనాంశుకైః కల్పితకేతుమాలమ్।
భాసోజ్జ్వలత్కాఞ్చనతోరణానాం
స్థానాన్తరం స్వర్గ ఇవాబభాసే॥**







**పదవిభాగము :–** సన్తానకాకీర్ణమహాపథమ్, తత్, చీనాంశుకైః, కల్పితకేతుమాలమ్, భాసా, ఉజ్జ్వలత్, కాఞ్చనతోరణానామ్, స్థానాన్తరమ్, స్వర్గః, ఇవ, ఆబభాసే।

**అన్వయము :–** సన్తానకాకీర్ణమహాపథం చీనాంశుకైః కల్పితకేతుమాలం కాఞ్చనతోరణానాం భాసా ఉజ్జ్వలత్ తత్ స్థానాన్తరం స్వర్గ ఇవ ఆబభాసే।

**ప్రతిపదార్థము :–** సన్తానకాకీర్ణమహాపథమ్ – సన్తానమను కల్పవృక్షముల పూలతో పఱువబడిన రాజమార్గములు గలదియు, చీనాంశుకైః – పట్టువస్త్రములతో, కల్పితకేతుమాలమ్ – విరచితమైన ధ్వజపంక్తులు గలదియు, కాఞ్చనతోరణానామ్ – సువర్ణబహిర్ద్వారములయొక్క, భాసా – ప్రకాశముతో, ఉజ్జ్వలత్ – వెలుగొందుచున్నదియగు, తత్ (పురమ్) – ఆ ఓషధిప్రస్థపట్టణము, స్థానాన్తరమ్ – మఱొక స్థానమును పొందినదై, స్వర్గః + ఇవ – స్వర్గమువలె, ఆబభాసే – ప్రకాశించెను.

**తాత్పర్యము :–** సన్తానమను కల్పవృక్షములపూలతో పఱువబడిన రాజమార్గము గలదియు, పట్టువస్త్రములతో విరచితమైన ధ్వజపంక్తులుగలదియు, సువర్ణ బహిర్ద్వారములయొక్క ప్రకాశముతో వెలుగొందుచున్నదగు, ఆ ఓషధిప్రస్థపట్టణము మరొకస్థానమును పొందినదై స్వర్గమువలె ప్రకాశించెను.

**పాఠాన్తరాలు :–** 1. …మహాపథం – చతుష్పథమ్।

**విభక్తులు / క్రియలు :–** 1. సన్తానకాకీర్ణమహాపథమ్ – …**పథమ్,** …పథే, …పథాని; అకారాన్త నపుంసకలింగ …పథశబ్దః, ప్ర.ఏ. 2. చీనాంశుకైః – చీనాంశుకేన, చీనాంశుకాభ్యామ్, **చీనాంశుకైః** అకారాన్త నపుంసకలింగ చీనాంశుకశబ్దః, తృ.బ. 3. కల్పితకేతుమాలమ్ – **…మాలమ్**, …మాలే, …మాలాని; అకారాన్త నపుంసకలింగ…మాలశబ్దః, ప్ర.బ 4. కాంచనతోరణానామ్ – …తోరణస్య, …తోరణయోః, **…తోరణానామ్**; అకారాన్త నపుంసకలింగ …తోరణశబ్దః, ష.బ. 5. భాసా – **భాసా**, భాసోభ్యామ్, భాసోభిః; సకారాన్త స్త్రీలింగ భాస్‌శబ్దః. తృ.ఏ. 6. ఉజ్జ్వలత్ – **ఉజ్జ్వలత్**, ఉజ్జ్వలతీ, ఉజ్జ్వలన్తి / ఉజ్జ్వలతి; తకారాన్త నపుంసకలింగ ఉజ్జ్వలత్‌శబ్దః / ఉజ్జ్వలతీతి ఉజ్జ్వలత్, శతృప్రత్యయః / ప్ర.ఏ. 7. తత్ – **తత్**, తే, తాని; దకారాన్త నపుంసకలింగ స్తచ్ఛబ్దః, ప్ర.ఏ. 8. స్థానాన్తరమ్ – **…స్థానాన్తరమ్**, స్థానాన్తరే, స్థానాన్తరాణి; అకారాన్త నపుంసకలింగః స్థానాన్తరశబ్దః, ప్ర.ఏ. 9. స్వర్గః – స్వర్గః, స్వర్గౌ, స్వర్గాః; అకారాన్త పుంలింగ స్వర్గశబ్దము ప్ర.ఏ. 10. ఆబభాసే – ఆఙుపసర్గపూర్వకాద్ 'భాసృదీప్తౌ' ఇతి ధాతోర్లిట్।

**సంధులు :–**

1. తత్ + చీనాంశుకైః = తచ్చీనాంశుకైః – శ్చుత్వసన్ధిః।
**స్తోఃశ్చునాశ్చుః** (సూ. 8–4–39)

2. భాసా + ఉజ్జ్వలత్ = భాసోజ్జ్వలత్ - గుణసన్ధిః।
**ఆద్గుణః** (సూ 6-1-84) అవర్ణమునకు (అ,ఆలకు) హ్రస్వదీర్ఘములైన ఇ, ఉ, ఋ, ఌ వర్ణములు పరముగానున్నప్పుడు పూర్వపరములస్థానములో గుణము ఏకాదేశమగును. ఇచట గుణములు క్రమముగా ఏఓఅర్అల్ అనునవి ఆదేశమగునని తెలియనగును.

3. స్వర్గః + ఇవ - స్వర్గ ఇవ - విసర్గలోపః।
అశ్ వర్ణములు (అనగా అచ్చులు, వర్గతృతీయ చతుర్థపంచమ వర్ణములు, యరలవలు (అంతస్థములు) హకారము పరమైనపుడు విసర్గ లోపించును.

4. ఇవ + ఆబభాసే - ఇవాబభాసే - సవర్ణదీర్ఘసన్ధిః।

**సమాసాలు :-**

1. సన్తానకాకీర్ణమహాపథమ్ - సన్తానకస్య పుష్పాణి సన్తానకాని, సన్తానకైః ఆకీర్ణాః సన్తానకాకీర్ణాః। మహాన్తః చ తే పన్థానః మహాపథాః సన్తానకాకీర్ణాః మహాపథాః యస్మిన్ తత్ సన్తానకాకీర్ణమహాపథమ్ బహువ్రీహిసమాసః।
2. చీనాంశుకైః - చీనస్య అంశుకాని చీనాంశుకాని, తైః చీనాంశుకైః, షష్ఠీతత్పురుషసమాసః।
3. కల్పితకేతుమాలమ్ - కేతూనాం మాలాః కేతుమాలాః। కల్పితాః కేతుమాలాః యస్య తత్। బహువ్రీహిసమాసః।
4. కాఞ్చనతోరణానామ్ - కాఞ్చనస్య వికారాః కాంచనాని, తాని చ తోరణాని, కాఞ్చనతోరణాని, తేషాం కాంచనతోరణానామ్। కర్మధారయః।
5. స్థానాన్తరమ్ - అన్యత్ స్థానం స్థానాన్తరమ్।... మ.వ్యం.సమాసః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. భాసా :-** ఎ) భాస్ (స్త్రీ.). భాః - Light, A ray of light
భాస్, To Shine, క్విప్ ప్రత్యయము, భావార్థమున
బి) భాసా - తృ.ఏ.
సి) శ్లో।। దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా।
యది **భాః** సదృశీ సా స్యాత్ భాసస్తస్య మహాత్మనః ।। భ.గీ. 11-12



ఆకాశమున వేలకొలది సూర్యులు ఒక్కుమ్మడిగా ఉదయించినచో వచ్చు కాన్తి పుంజములును ఆ విరాట్ - రూపతేజస్సులకు సాటిరావు.

డి) శ్లో।। త్వదాస్యలక్ష్మీముకురం చకోరైః స్వకౌముదీమాదయమానమిన్దుమ్।
దృశా నిశేన్దీవరచారు**భాసా** పిబోరు రమ్భాతరుపీవరోరు!।।
-నైషధీయచరితమ్ - 22-42

**అలంకారాలు :-** ఇందు 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును.

**లక్షణము :-** శ్లో।। సంభావనాస్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా।
ఉక్తానుక్తాస్పదాద్యాత్ర సిద్ధాసిద్ధాస్పదే పరే।।

వస్తువునుబట్టి, హేతువునుబట్టి, ఫలమునుబట్టి యూహించుట యుత్ప్రేక్షాలంకార మగును. ఉపమానముకున్న ధర్మములే యుపమేయమునందుండుటచేత నుపమేయమునకుపమాన తాదాత్మ్యము నూహించిన యెడల **'ఉత్ప్రేక్ష' యగును.** ఇట ఓషధిప్రస్థపురమును స్వర్గముగా సంభావించుటచే నిది 'ఉత్ప్రేక్షాలంకార' మని చెప్పదగును.

**క్రియాదర్శము:- ఆబభాసే** - ఆఙ్ - ఉపసర్గ; భాసృ - దీప్తౌ - అకర్మకమ్‌సేట్, ఆత్మనేపదీ, భ్వాదయః। లిట్ - ప్ర.ఏ.

**ఆబభాసే** - ఆబభాసాతే - ఆబభాసిరే.

---

**అవతారిక:-** ఆసన్నపాణిగ్రహణత్వాదుమా పిత్రోరధికప్రేమాస్పదం బభూవ -

**శ్లో।। ఏకైవ సత్యామపి పుత్త్రపఙ్క్తౌ**
**చిరస్య దృష్టేవ మృతోత్థితేవ।**
**ఆసన్నపాణిగ్రహణేతి పిత్రో-**
**రుమా విశేషోచ్ఛ్వసితం బభూవ।।** **4**

**పదవిభాగము:-**ఏకా, ఏవ, సత్యామ్, అపి, పుత్త్రపఙ్క్తౌ, చిరస్య, దృష్టా, ఇవ, మృతోత్థితా, ఇవ, ఆసన్నపాణిగ్రహణా, ఇతి, పిత్రోః, ఉమా, విశేషోచ్ఛ్వసితమ్, బభూవ।

**అన్వయము :-** పుత్త్రపఙ్క్తౌ సత్యామపి ఉమా ఏక ఏవ చిరస్య దృష్టా ఇవ, మృతోత్థితా ఇవ, ఆసన్నపాణిగ్రహణా ఇతి (హేతోః) పిత్రోః విశేషోచ్ఛ్వసితం బభూవ।

**ప్రతిపదార్థము :–** పుత్త్రపఙ్క్తౌ – పుత్త్రదుహితృపంక్తిగల, సత్యామ్ అపి – ఉన్నదానియందు , ఉమా – పార్వతీదేవి, ఏకా ఏవ – ఒక్కతెయే, చిరస్య దృష్టా ఇవ – చాలాకాలమునుండి కనబడక ఇప్పుడే కనబడినట్టును, మృతోత్థితా ఇవ – మరణించి మరల లేచి వచ్చినదో అన్నట్లును, ఆసన్నపాణిగ్రహణా ఇతి – భర్తృగృహమునకు త్వరలో వెళ్ళును అను కారణము వలన, పిత్రోః – తల్లిదండ్రులగు మేనాహిమవంతులకు, విశేషోచ్ఛ్వసితమ్ – ప్రాణభూతురాలు, బభూవ – ఆయెను.

**తాత్పర్యము :–** తల్లిదండ్రులగు మేనాహిమవంతులకు ఉన్న పుత్త్రదుహితృపంక్తి యందు పార్వతీదేవి ఒక్కతెయే భర్తృగృహమునకు త్వరలో వెళ్ళునను కారణమువలన వారికి ప్రాణభూతురాలు ఆయెను.

**పాఠాన్తరాలు :–** 1. ఆసన్న... – ఉపోఢ ...; 2. చిరస్య – చిరేణ;

**విభక్తులు / క్రియలు :–** 1. పుత్త్రపుఙ్క్తౌ – **పుత్త్రపఙ్క్తౌ,** పుత్త్రపఙ్క్త్యోః, పుత్త్రపఙ్క్తిషు; ఇకారాన్తః స్త్రీలింగః పుత్త్రపఙ్క్తిశబ్దః, స.ఏ. 2. సత్యామ్ – **సత్యామ్,** సత్యోః, సతీషు; ఈకారాన్త స్త్రీలింగః సతీశబ్దః (అస్తీతి సతీ, తస్యాం సత్యామ్), స.ఏ.3. అపి, ఏవ, ఇతి – అవ్యయాలు. 4. ఉమా – **ఉమా,** ఉమే, ఉమాః; ఆకారాన్తః స్త్రీలింగః ఉమాశబ్దః, ప్ర.ఏ. 5. ఏకా – **ఏకా,** ఏకే, ఏకాః ఆకారాన్తః స్త్రీలింగః ఏకాశబ్దః, ప్ర.ఏ. 6. దృష్టా – **దృష్టా,** దృష్టే, దృష్టాః; ఆకారాన్తః స్త్రీలింగః దృష్టాశబ్దః, ప్ర.ఏ. 7. ఆసన్నపాణిగ్రహణా – **...గ్రహణా,** ...గ్రహణే, ...గ్రహణాః; ఆకారాన్తః స్త్రీలింగః ...గ్రహణాశబ్దః, ప్ర.ఏ. 8. మృతోత్థితా – **మృతోత్థితా,** మృతోత్థితే, మృతోత్థితాః; ఆకారాన్తః స్త్రీలింగః మృతోత్థితాశబ్దః, ప్ర.ఏ. 9. చిరస్య – అవ్యయము 10. పిత్రోః – పితుః, **పిత్రోః,** పితౄణామ్, ఋకారాన్తః పుంలింగ పితృశబ్దః, ష.ద్వి. 11. విశేషోచ్ఛ్వసితమ్ – విశేషోచ్ఛ్వసితే, విశేషోచ్ఛ్వసితాని, అకారాన్త నపుంసకలిఙ్గః విశేషోచ్ఛ్వసితశబ్దః, ప్ర.ఏ. 12. బభూవ – లిట్ ప్రథమపురుషైకవచనాంతః

**సంధులు :–**

1. ఏకా + ఏవ = ఏకైవ – వృద్ధిసన్ధిః। వృద్ధిరేచి (సూ 6-1-85)
2. దృష్టా + ఇవ = దృష్టేవ – గుణసన్ధిః – ఆద్గుణః (సూ 6-1-84)
3. మృతోత్థితా + ఇవ = మృతోత్థితేవ – గుణసన్ధిః।
4. ఆసన్నపాణిగ్రహణా + ఇతి = ఆసన్నపాణిగ్రహణేతి – గుణసన్ధిః।
5. పిత్రోః + ఉమా = పిత్రోరుమా – విసర్గసన్ధిః।

**సమాసాలు :–**

1. పుత్త్రపఙ్క్తౌ – పుత్రాశ్చ దుహితరశ్చ పుత్త్రాః। తేషాం పఙ్క్తిః పుత్త్రపఙ్క్తిః, తస్యాం పుత్త్రపఙ్క్తౌ। ష.త।





2. మృతోత్థితా – మృతా చాసౌ ఉత్థితా మృతోత్థితా। కర్మధారయసమాసః।
3. పిత్రోః – మాతా చ పితా చ పితరౌ, తయోః పిత్రోః। ఏకశేషవృత్తిః।
4. విశేషోచ్ఛ్వసితమ్ – విశేషేణ ఉచ్ఛ్వసితం, విశేషోచ్ఛ్వసితమ్। **'సుప్సుపా'** ఇతి సమాసః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

1. **చిరస్య** – అవ్యయము. ఇట అవ్యయకోశము (350)ను చూడగలరు. అందు ... అత ఏవాద్యాపి సమానార్థకాః సార్వవిభక్తికాః సమానప్రకృతికాః చిరమ్, చిరేణ, చిరాయ, చిరాత్, **చిరస్య**, చిరే, ఇత్యాకారాః ప్రయోగాః లభ్యన్తే। ఏతేన చిరరాత్రాయ ఇత్యపి వ్యాఖ్యాతమ్ – ఇతి వదన్తి। అభిధానకోశేషు తు సర్వత్ర అవ్యయత్వేనైతేషాం వివరణం కృతమ్ – ఇత్యలమతివిస్తరేణ। –

శ్లో॥ తదీయమాతఙ్గఘటావిఘట్టితైః కటస్థలప్రోషితదానవారిభిః।
గృహీతదిక్కైరపునర్నివర్తిభి**శ్చిరస్య** యాథార్థ్యమలమ్భి దిగ్గజైః॥
– శిశుపాలవధే – 1-64

శ్లో॥ త్వమర్హతాం ప్రాగ్రసరః స్మృతోఽసి నః శకున్తలా మూర్తిమతీ చ సత్క్రియా।
సమానయంస్తుల్యగుణం వధూవరం **చిరస్య** వాచ్యం న గతః ప్రజాపతిః
– అభిజ్ఞానశాకున్తలే – 5-15

**అలంకారాలు :–** ఇందు 'ఉపమాలంకార'మున్నదని చెప్పదగును.

'ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః। – అని చంద్రాలోకలక్షణము. ఇట పార్వతీదేవిని దృష్టా ఇవ అనియు; మృతోత్థితా ఇవ అని వర్ణింపబడుటచే నిది 'ఉపమాలంకార'మగును.

**క్రియాదర్శము :– బభూవ** – అస (అస్) భువి (ఉండుట) అదాదిప్రకరణమ్। అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్ – ప్ర.ఏ.

**బభూవ** – బభూవతుః – బభూవుః

–––

**అవతారిక :–** న కేవలం పిత్రోః, అపి తు బన్ధూనామపి సా స్నేహస్యైకభాజనం బభూవ।

శ్లో॥ అఙ్కాద్యయావఙ్కముదీరితాశీ–
స్సా మణ్డనాన్మణ్డనమన్వభుఙ్క్త।
సమ్బన్ధిభిన్నోఽపి గిరేః కులస్య
స్నేహస్తదేకాయతనం జగామ॥ **5**

**పదవిభాగము :–** అఙ్కాద్, యయౌ, అఙ్కమ్, ఉదీరితాశీః, సా, మణ్డనాత్, మణ్డనమ్, అన్వభుఙ్క్త। సమ్బన్ధిభిన్నః, అపి, గిరేః, కులస్య, స్నేహః, తదేకాయతనమ్, జగామ।

**అన్వయము :–** సా ఉదీరితాశీః (సతీ) అఙ్కాద్ అఙ్కం యయౌ। మణ్డనాద్ మణ్డనమ్ అన్వభుఙ్క్త। సంబన్ధిభిన్నః అపి గిరేః కులస్య స్నేహః తదేకాయతనం జగామ।

**ప్రతిపదార్థము :–** సా – ఆ పార్వతీదేవి, ఉదీరితాశీః (సతీ) – పెద్దల అశీస్సుల నందుకొనుచు, అఙ్కాద్ అఙ్కమ్ – ఒకరి ఒడినుండి మఱియొకరి ఒడిని, యయౌ – పొందెను. మణ్డనాద్ – ఒక అలంకారమునుండి, మణ్డనమ్ – మరియొక అలంకారమును, అన్వభుఙ్క్త – కలిగి ఒప్పారెను. సంబన్ధిభిన్నః అపి – సంబంధీయులు (స్వపుత్రాదులు) కాకున్నను, గిరేః కులస్య స్నేహః – హిమవంతుని ఆదరముచే వంశమునకు గల, తదేకాయతనమ్ – ఒకే గృహముగా, జగామ – పొందెను.

**తాత్పర్యము :–** ఆ పార్వతీదేవి పెద్దల ఆశీస్సులనందుకొనుచు ఒకరి ఒడినుండి మఱియొకరి ఒడిని పొందెను. ఒక అలంకారమునుండి మఱియొక అలంకారము నొంది ఒప్పారి సంబంధీయులు కాకున్నను హిమవంతుని వంశమునకుగల ఆదరముచే ఒకే గృహముగా పొందెను.

**పాఠాన్తరాలు :–** 1. సమ్బన్ధి .... సంబన్ధ...

**విభక్తులు / క్రియలు :–** 1. సా – **సా,** తే, తాః; దకారాన్తః స్త్రీలింగ స్తచ్ఛబ్దః, ప్ర.ఏ. 2. ఉదీరితాశీః – **ఉదీరితాశీః,** ఉదీరుతాశిషౌ, ఉదీరితాశిషః; షాన్తఃస్త్రీలింగః 'ఆశిష్'శబ్దః (ఆశీర్వాదః), ప్ర.ఏ. 3. అఙ్కాద్ – **అఙ్కాద్,** అఙ్కాభ్యామ్, అఙ్కేభ్యః; అకారాన్తః పుంలింగః, అఙ్కశబ్దః, పం.ఏ. 4. అఙ్కమ్ – **అఙ్కమ్,** అఙ్కౌ, అఙ్కాన్; అకారాన్తః పుంలింగ అఙ్కశబ్దః, ద్వి.ఏ. 5. యయౌ – క్రియ, లిట్, ప్ర.ఏ. 6. మణ్డనాద్ – **మణ్డనాద్,** మణ్డనాభ్యామ్, మణ్డనేభ్యః, అకారాన్తః పుంలింగో మణ్డనశబ్దః పం.ఏ. 7. మణ్డనమ్ – **మణ్డనమ్ ,** మణ్డనౌ, మణ్డనాన్, అకారాన్తః పుంలింగో మణ్డనశబ్దః, ద్వి.ఏ 8. అన్వభుఙ్క్త – (అను – ఉపసర్గ) క్రియ, లఙ్, ప్ర.ఏ. 9. సంబన్ధిభిన్నః – **...భిన్నః,** ...భిన్నౌ, ...భిన్నాః; అకారాన్తః పుంలింగః ...భిన్నశబ్దః, ప్ర.ఏ. 10. గిరేః – **గిరేః,** గిర్యోః, గిరీణామ్; ఇకారాన్తః పుంలింగో గిరిశబ్దః, ష.ఏ. 11. కులస్య – **కులస్య,** కులయోః, కులానామ్; అకారాన్తః నపుంసకలింగః



, కులశబ్దః ష.ఏ. 12. స్నేహః – **స్నేహః,** స్నేహౌ, స్నేహాః, అకారాన్తః పుంలింగః స్నేహశబ్దః, ప్ర.ఏ. **13. జగామ –** క్రియ, లిట్, ప్ర.ఏ.

**సంధులు :–**

1. యయౌ + అఙ్కమ్ – యయావఙ్కమ్ – అయవాయావసన్ధిః ఏచోఽయవాయావః (సూ 6–1–78)
2. ఉదీరితాశీః + సా – ఉదీరితాశీస్సా – విసర్గసన్ధిః (సకారాదేశః)।
3. మణ్డనాత్ + మణ్డనమ్ – మణానాన్మణ్డనమ్ – అనునాసికసన్ధిః।
4. సమ్బన్ధిభిన్నః + అపి – సమ్బన్ధిభిన్నోఽపి – (ఉత్వాదేశః) పూర్వరూపసన్ధిః
5. స్నేహః + తదేకాయతనమ్ – స్నేహస్తదేకాయతనమ్ – విసర్గసన్ధిః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. ఉదీరితాశీః – ఉదీరితాః ఆశిషః యస్యై సా ఉదీరితాశీః। బహువ్రీహిః।
2. సమ్బన్ధిభిన్నః – సమ్బన్ధః అస్తి యేషాం తే సమ్బన్ధినః తైః భిన్నః। సమ్బన్ధిభిన్నః తృ.త.।
3. తదేకాయతనమ్ – ఏకం చ తద్ ఆయతనమ్ ఏకాయతనమ్, సా చ తద్ ఏకాయతనమ్ తదేకాయతనమ్।

**పదవృత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ఆశీః :–** ఎ) షాన్తః స్త్రీలింగః, ఆశిష్‌శబ్దః। ప్ర.ఏ.

బి) 'ఆఙ్‌శాసు ఇచ్ఛాయామ్' అస్మాత్ క్విపి 'ఆశాసః కావుపధాయా ఇత్వం వాచ్యమ్' ఇత్యుపధాయా ఇత్వే **'శాసివసీ'**తి షత్వే సోర్లోపే సతి షత్వస్యాసిద్ధత్వాత్ రుత్వే 'ర్వోరి'తి దీర్ఘే రేఫస్య విసర్గః।

సి) శ్లో॥ తస్మై **జయాశీ** స్ససృజే పురస్తా–
త్సప్తర్షిభిస్తాన్ స్మితపూర్వమాహ।
వివాహయజ్ఞే వితతేఽత్ర యూయ–
మధ్వర్యవః పూర్వవృతా మయేతి॥ –కు.సం. 7–47

డి) అథ **ఖల్వాశీస్స**మృద్ధిరుపసరణానీత్యుపాసీతయేన
సామ్నాస్తోష్యన్స్యాత్తత్సామోపధావేత్। ఛాన్దో 1–3–8
(అథ – ఖలు – **ఆశీస్స**మృద్ధిః...)

ఇ) 'ఆశీః నమస్క్రియావస్తునిర్దేశోవాపి తన్ముఖమ్'

– అని విశ్వనాథుడు – (సాహిత్యదర్పణము)

**క్రియాదర్శము :-**

**1. యయౌ:-** యా – ప్రాపణే (పొందుట, వెళ్ళుట) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, అదాదిప్రకరణమ్, లిట్ – ప్ర.ఏ.

**యయౌ –** యయతుః – యయుః

శ్లో॥ స **యయౌ** ప్రథమం ప్రాచీం తుల్యః ప్రాచీనబర్హిషా।
అహితానానిలోద్ధూతైః తర్జయన్నివ కేతుభిః॥ ర.వం. 4–28

**2. అన్వభుఙ్క్త** అను – ఉపసర్గపూర్వకాత్ 'భుజ – పాలనాభ్యవహారయో' రిత్యస్మాద్ధాతో స్సకర్మకాత్ కర్తరి లఙ్ ఆత్మనేపదే ప్రథమపురుషైకవచనాంతః। రుధాదిప్రకరణమ్, **అన్వభుఙ్క్త** – అన్వభుఞ్జాతామ్ – అన్వభుఞ్జత

**3. జగామ** – గమ (గమ్) గతౌ (వెళ్ళుట) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్, లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**జగామ** – జగ్మతుః – జగ్ముః

---

**అవతారిక :-** శుభే ముహూర్తే బన్ధుస్త్రియః పార్వత్యాః శరీరే ప్రసాధనం చక్రుః –

**శ్లో॥ మైత్రే ముహూర్తే శశలాఞ్ఛనేన**
**యోగం గతాసూత్తరఫల్గునీషు।**
**తస్యాశ్శరీరే ప్రతికర్మ చక్రు–**
**ర్బన్ధుస్త్రియో యాః పతిపుత్రవత్యః॥ 6**



**పదవిభాగము :-** మైత్రే, ముహూర్తే, శశలాఞ్ఛనేన, యోగమ్, గతాసు, ఉత్తరఫల్గునీషు, తస్యాః, శరీరే, ప్రతికర్మ, చక్రుః, బన్ధుస్త్రియః, యాః, పతిపుత్రవత్యః

**అన్వయము :-** (అథ) మైత్రే ముహూర్తే ఉత్తరఫల్గునీషు శశలాఞ్ఛనేన యోగం గతాసు తస్యాః శరీరే యాః పతిపుత్రవత్యః, (తాః) బన్ధుస్త్రియః ప్రతికర్మ చక్రుః।

**ప్రతిపదార్థము :-** (అథ – పిమ్మట), మైత్రే – 'మిత్రుడు' దేవతగాగల మైత్రము అను, ముహూర్తే – శుభముహూర్తముగలదియు, ఉత్తరఫల్గునీషు – ఉత్తరఫల్గునీ



నక్షత్రముగలదియు అగు, శశలాఞ్ఛనేన – చంద్రునితో, యోగమ్ –యోగమును, గతాసు – పొందియున్న దానియందు, తస్యాః – ఆ పార్వతీదేవియొక్క, శరీరే – శరీరమున, యాః పతిపుత్రవత్యః – పతి పుత్త్రాదులున్న వారెవరో, తాః బన్ధుస్త్రియః – ఆ బన్ధుస్త్రీలు, ప్రతికర్మ – మకరికాపత్రాద్యలంకార శోభను – (సుబోధినీ వచనమును), చక్రుః – చేసిరి.

**తాత్పర్యము :-** 'మిత్రుడు' దేవతగాగల 'మైత్ర'మను ముహూర్తముగలదియు, ఉత్తర ఫల్గునీనక్షత్రముగలదియు అగు, చంద్రునితో యోగమును పొందియున్న దానియందు, ఆ పార్వతీదేవియొక్క శరీరమున పతిపుత్త్రాదులున్న బన్ధుస్త్రీలు మకరికాపత్రాద్యలంకార శోభను చేసిరి.

**పాఠాన్తరాలు :-** 1. శశలాఞ్ఛనేన – శశలక్షణేన; 2. యోగమ్ – యోగేన.

**విభక్తులు – క్రియలు :-** 1. మైత్రే – **మైత్రే,** మైత్రయోః, మైత్రేషు; అకారాన్త నపుంసకలింగః (పుం) – మైత్రశబ్దః, స.ఏ. 2. ముహూర్తే – **ముహూర్తే,** ముహూర్తయోః, ముహూర్తేషు; అకారాన్త నపుంసకలింగః ముహూర్తశబ్దః, స.ఏ. 3. ఉత్తరఫల్గునీషు – ఉత్తరఫల్గున్యామ్, ఉత్తరఫల్గున్యోః, **ఉత్తరఫల్గునీషు;** ఈకారాన్తః స్త్రీలింగ ఉత్తరఫల్గునీశబ్దః, స.బ. 4. శశలాఞ్ఛనేన – **శశలాఞ్ఛనేన,** శశలాఞ్ఛనాభ్యామ్, శశలాఞ్ఛనైః; అకారాన్తః పుంలింగో శశలాఞ్ఛనశబ్దః, తృ.ఏ. 5. యోగమ్ – **యోగమ్,** యోగౌ, యోగాన్; అకారాన్తః పుంలింగో యోగశబ్దః, ద్వి.ఏ. 6. గతాసు – గతాయామ్, గతయోః, **గతాసు**; ఆకారాన్తః స్త్రీలింగో గతాశబ్దః, స.బ. 7. తస్యాః – **తస్యాః,** తయోః, తాసామ్; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః, ష.ఏ. 8. శరీరే – **శరీరే,** శరీరయోః, శరీరేషు; అకారాన్త నపుంసకలింగః శరీరశబ్దః, స.ఏ. 9. యాః – యా, యే, **యాః,** దకారాన్తః స్త్రీలింగో యచ్ఛబ్దః, ప్ర.బ. 10. పతిపుత్త్రవత్యః – ...వతీ, ...వత్యౌ, ...వత్యః; ఈకారాన్తః స్త్రీలింగో ...వతీశబ్దః, ప్ర.బ. 11. బన్ధుస్త్రియః – బన్ధుస్త్రీ, బన్ధుస్త్రియౌ, **బన్ధుస్త్రియః,** ఈకారాన్తః స్త్రీలిఙ్గః, స్త్రీశబ్దః। ప్ర.ఏ. 12. ప్రతికర్మ – **ప్రతికర్మ,** ప్రతికర్మణీ, ప్రతికర్మాణి, నకారాన్త నపుంసకలింగః ప్రతికర్మన్‌శబ్దః, ద్వి,ఏ. 13. చక్రుః – క్రియ, డుకృఞ్ (కృ) కరణే – లిట్ – ప్ర.బ.

**సంధులు :-**

1. గతాసు + ఉత్తర... – గతాసూత్తర... – సవర్ణదీర్ఘసన్ధిః।
2. తస్యాః + శరీరే – తస్యాశ్శరీరే – విసర్గాదేశః – **వా శరి** (సూ 8–3–36) శషస వర్ణములుపరముగా ఉన్నప్పుడు విసర్గమునకు శషసలు వికల్పముగ వచ్చును. కాదేని విసర్గమునకు విసర్గయే వచ్చును.
3. చక్రుః + బన్ధుస్త్రియః – చక్రుర్బన్ధుస్త్రియః – విసర్గసన్ధిః (రుత్వమ్)।
4. బన్ధుస్త్రియః + యాః – బన్ధుస్త్రియో యాః – స్వాదిసన్ధిః (ఉత్వాదేశః)

**సమాసాలు / విగ్రహవాక్యాలు :-**

1. ఉత్తరఫల్గునీషు - ఉత్తరాశ్చ తాః ఫల్గున్యః ఉత్తరఫల్గున్యః, తాసు ఉత్తరఫల్గునీషు। కర్మధారయః।
2. శశలాఞ్ఛనేన - శశః లాఞ్ఛనం యస్య స శశలాఞ్ఛనః తేన శశలాఞ్ఛనేన। బహువ్రీహిసమాసః।
3. బన్ధుస్త్రియః - బన్ధూనాం స్త్రియః బన్ధుస్త్రియః -షష్ఠీతత్పురుష సమాసః।
4. పతిపుత్రవత్యః - పతిశ్చ పుత్రాశ్చ పతిపుత్రాః, తే సన్తి ఆసాం యాసాం తాః పతిపుత్రవత్యః - తద్ధితవృత్తిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**మైత్రే ముహూర్తే :-**

ఎ) అకారాన్త నపుంసకలింగో మైత్రశబ్దః, స.ఏ.

బి) మిత్రః దేవతా అస్య మైత్రః, తస్మిన్ మైత్రే

'సాస్య దేవతా' ఇతి అణ్। 'ద్యుమణిస్తరణిర్మిత్రశ్చిత్రభానువిభావసుః' ఇత్యమరః।

సి) 'ఆర్ద్రః సార్పస్తథా మైత్రః శుభో వాసవ ఏవ చ' ఇతి బృహస్పతి స్మరణాత్ - అని మల్లినాథుడు

డి) 'ఉదయాత్ తృతీయముహూర్తే'

ఇ) శ్లో॥ సా పుణ్యా ధ్వజినీ గఙ్గాం దాశైః సంతారితా స్వయమ్।
**మైత్రే ముహూర్తే** ప్రయయౌ ప్రయాగవనముత్తమమ్॥
- శ్రీమద్రామాయణే - 2 - 89 - 21

జి) "మైత్రే మిత్రదేవత్యే। ముహూర్తే ముహూర్తశబ్దే నాసికాద్వయవాచీ।

"అష్టాదశా నిమేషాస్తు కాష్ఠా త్రింశత్ తు తాః కలా।

తాస్తు త్రింశత్ క్షణాస్తే తు **ముహూర్తో** ద్వాదశాస్త్రియామ్।

తే తు త్రింశదహోరాత్రః" ఇతి సింహః। సూర్యోదయాభ్యో తృతీయో ముహూర్తో మైత్రః। "రౌద్రః సార్పస్తథా మైత్రః। ఇత్యాది వచనాత్ - అని 'వివరణమ్' వ్యాఖ్య.

**క్రియాదర్శము :- చక్రుః :-** డుకృఞ్ (కృ) కరణే (చేయుట) తనాదిప్రకరణమ్, సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, లిట్ - ప్ర.బ.





శ్లో॥ తే రేఖాధ్వజకలశాతపత్రచిహ్నం
సమ్రాజశ్చరణయుగం ప్రసాదలభ్యమ్।
ప్రస్థానప్రణతిభిరంగులీషు **చక్రుః**
మౌళిస్రక్చ్యుతమకరన్దరేణుగౌరమ్॥ - రఘువంశమహాకావ్యే - 4-88

---

**అవతారిక:-** అథ ద్వాభ్యాం శ్లోకాభ్యాం ప్రసాధనం వర్ణయతి సా అభ్యఙ్గనేపథ్య మలంచకార।

**శ్లో॥ సా గౌరసిద్ధార్థనివేశవద్భి-**
**ర్దూర్వాప్రవాలైః ప్రతిభిన్నశోభమ్।**
**నిర్నాభికౌశేయముపాత్తబాణ-**
**మభ్యఙ్గనేపథ్యమలఞ్చకార॥** **7**

**పదవిభాగము :-** సా, గౌరసిద్ధార్థనివేశవద్భిః, దూర్వాప్రవాలైః, ప్రతిభిన్నశోభమ్, నిర్నాభికౌశేయమ్, ఉపాత్తబాణమ్, అభ్యఙ్గనేపథ్యమ్, అలఞ్చకార॥

**ప్రతిపదార్థము :-** సా - ఆ పార్వతీదేవి, గౌరసిద్ధార్థనివేశవద్భిః - తెల్లఆవాలు కూడియున్న, దూర్వాప్రవాలైః - తెల్లగరిక పోచలచేత, ప్రతిభిన్నశోభమ్ - విశేషశోభయును, నిర్నాభికౌశేయమ్ - బొడ్డుపైకి కట్టుకున్న పట్టుబట్టయును, ఉపాత్తబాణమ్ - గృహీతశరమును గలది అగు, అభ్యఙ్గనేపథ్యమ్ - అభ్యంగనస్నానమును గుఱించి, అలఞ్చకార - అలంకరింపబడినది.

**తాత్పర్యము :-** ఆ పార్వతీదేవి తెల్ల ఆవాలు కూడియున్న తెల్లగరిక పోచలచేత విశేషశోభయును, బొడ్డుపైకి కట్టుకొన్న పట్టుబట్టయును, గృహీతశరమును కలది అగు అభ్యంగనస్నానమునుగుఱించి అలంకరింపబడినది.

**పాఠాన్తరాలు :-**

1. ...శోభమ్ - ...రాగమ్ 2. ఉపాత్త ... - ఉపోఢ...
3. నిర్నాభి ... - ఉన్నీవి...

**విభక్తులు - క్రియలు :-** 1. సా - **సా**, తే, తాః; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః, ప్ర.ఏ. 2. గౌరసిద్ధార్థనివేశవద్భిః - గౌరసిద్ధార్థనివేశవతా, ..నివేశవద్భ్యామ్, **...నివేశవద్భిః**; తకారాన్త నపుంసకలింగో...నివేశవచ్ఛబ్దః, తృ.బ. 3. దూర్వాప్రవాలైః - **దూర్వాప్రవాలేన,** దూర్వాప్రవాలాభ్యామ్,

**దూర్వాప్రవాలైః**; అకారాన్త నపుంసకలింగో దూర్వాప్రవాలశబ్దః, తృ.బ. 4. ప్రతిభిన్నశోభమ్ – ...**శోభమ్,** ...శోభే, ...శోభాని; అకారాన్త నపుంసకలింగో ...శోభశబ్దః, ద్వి.ఏ. 5. నిర్నాభికౌశేయమ్ – ...**కౌశేయమ్,** ...కౌశేయే, ...కౌశేయాని; అకారాన్త నపుంసకలింగః ...కౌశేయశబ్దః, ద్వి.ఏ. 6. ఉపాత్తబాణమ్ – ...బాణమ్, ...బాణే, ...బాణాని; అకారాన్త నపుంసకలింగ...బాణశబ్దః, ద్వి.ఏ. 7. అభ్యఙ్గనేపథ్యమ్ – ...నేపథ్యమ్, ...నేపథ్యే, ...నేపథ్యాని; అకారాన్త నపుంసకలింగ ...నేపథ్యశబ్దః, ద్వి.ఏ. 8. అలఞ్చకార – క్రియ.

**సంధులు :–**

1. ...నివేశవద్భిః + దూర్వాప్రవాలైః – ...నివేశవద్భిర్దూర్వాప్రవాలైః – విసర్గసన్ధిః। (రేఫాదేశము)

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. గౌరసిద్ధార్థనివేశవద్భిః – గౌరసిద్ధార్థానాం నివేశః గౌరసిద్ధార్థనివేశః సః అస్తి గౌరసిద్ధార్థనివేశవన్తి, తైః గౌరసిద్ధార్థనివేశవద్భిః। – తద్ధితవృత్తిః।
2. దూర్వాప్రవాలైః – దూర్వాయాః ప్రవాలాని, దూర్వాప్రవాలాని, తైః దూర్వాప్రవాలైః। – షష్ఠీతత్పురుష సమాసః।
3. ప్రతిభిన్నశోభమ్ – ప్రతిభిన్నా శోభా యస్య తత్ ప్రతిభిన్నశోభమ్, తత్। బహుప్రీహిసమాసః।
4. నిర్నాభికౌశేయమ్ – నాభేః; నిష్క్రాంతం నిర్నాభి, నిర్నాభి కౌశేయమ్ యస్మిన్ తద్। నిర్నాభికౌశేయమ్, తత్ – బ.స।
5. ఉపాత్తబాణమ్ – ఉపాత్తః బాణః యస్మిన్ తద్ ఉపాత్తబాణం, తత్ – బ.స।
6. అభ్యఙ్గనేపథ్యమ్ – అభ్యఙ్గస్య నేపథ్యమ్ అభ్యఙ్గనేపథ్యమ్, తత్। షష్ఠీతత్పురుషసమాసః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. సిద్ధార్థః :–** ఎ) సిద్ధోర్థో యస్మాత్। శ్వేతసర్షపః। గౌరసర్షపః। తెల్ల ఆవాలు

బి) శ్లో॥ ధ్రువాయ పథి దృష్టాయ తత్ర తత్ర పురస్త్రియః।
**సిద్ధార్థా**క్షతదధ్యంబు **దూర్వా**పుష్పఫలాని చ॥
– శ్రీమద్భాగవతే 4–9–58

'ధ్రువునిపై మాతృవాత్సల్యముతో పురస్త్రీలు మార్గమున **తెల్ల ఆవాలు** యవలు, పెరుగు, జలము, లేతగరిక, పుష్పములు, పండ్లు కూడా చల్లిరి'.





సి) శ్లో॥ నృపః పురస్త్రైః ప్రతిబద్ధవర్త్మా పశ్చాత్తనైః కశ్చన నుద్యమానః।
యద్రస్థ**సిద్ధార్థ**పదాభిషేకం లబ్ధ్వాప్యసిద్ధార్థమమన్యత స్వమ్॥
– నైషధీయచరితే 10 –6

**క్రియాదర్థము :–** 1. **అలంచకార** – అలంపూర్వకాత్ 'డుకృఞ్కరణ' ఇత్యస్మాద్ధాతో స్సకర్మకాత్కర్తరి భూతే లిట్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః।

**అలఞ్చకార** – అలఞ్చక్రతుః – అలఞ్చక్రుః

---

**అవతారిక:–** బాణసంపర్కం ప్రాప్తా ఉమా శుక్లపక్షాదౌ సూర్యకరస్పృష్టా చన్ద్రలేఖేవ బభౌ–

**శ్లో॥ బభౌ చ సంపర్కముపేత్య బాలా**
**నవేన దీక్షావిధిసాయకేన।**
**కరేణ భానోర్బహులావసానే**
**సంధుక్ష్యమాణేవ శశాఙ్కరేఖా॥** **8**

**పదవిభాగము :–** బభౌ, చ, సమ్పర్కమ్, ఉపేత్య, బాలా, నవేన, దీక్షావిధిసాయకేన, కరేణ, భానోః, బహులావసానే, సంధుక్ష్యమాణా, ఇవ, శశాఙ్కరేఖా।

**అన్వయము :–** (కిం) చ బాలా నవేన దీక్షావిధిసాయకేన సమ్పర్కమ్ ఉపేత్య బహులావసానే భానోః కరేణ సన్ధుక్ష్యమాణా శశాఙ్కరేఖా ఇవ బభౌ।

**ప్రతిపదార్థము :–** (కి)ఞ్చ = ఇంకా, (ఇచట 'చ' అనునది 'కిఞ్చ' అనునర్థమున వాడబడినది.), బాలా = పార్వతీదేవి, నవేన = క్రొత్తదగు, దీక్షావిధిసాయకేన = వివాహదీక్షావిధిప్రకారము పట్టుకొన్న బాణముతోటి, సమ్పర్కమ్ = కలయికను, ఉపేత్య = పొంది, బహులావసానే = బహుళపక్షాంతమునందు (అనగా శుక్లపక్ష ప్రారంభమున), భానోః = సూర్యునియొక్క, కరేణ = కిరణముచే, సన్ధుక్ష్యమాణా = వెలిగింపబడిన, శశాఙ్కరేఖా + ఇవ = చంద్రరేఖవలె, బభౌ = భాసించెను.

**తాత్పర్యము :–** ఇంకా, పార్వతీదేవి – క్రొత్తదగు వివాహదీక్షావిధి ప్రకారము పట్టుకొన్న బాణముతోటి కలయికను పొంది, బహుళ పక్షాంతమున అనగా శుక్లపక్షారంభమున సూర్యకిరణముచే వెలిగింపబడిన చంద్రరేఖవలె భాసించెను.

**పాఠాన్తరాలు :-**

1. నవేన – వివాహ... నవేవ, 2. ...రేఖా – ...లేఖా.

**విభక్తులు – క్రియలు :-** 1. బాలా – **బాలా**, బాలే, బాలాః; ఆకారాన్తః స్త్రీలింగో బాలాశబ్దః, ప్ర.ఏ. 2. నవేన – **నవేన,** నవాభ్యామ్, నవైః; అకారాన్తః పుంలింగో నవశబ్దః। తృ.ఏ. 3. దీక్షావిధిసాయకేన – **...సాయకేన,** ...సాయకాభ్యామ్, ...సాయకైః; అకారాన్తః పుంలింగో...సాయకశబ్దః తృ.ఏ.4. సమ్పర్కమ్ – **సమ్పర్కమ్,** సంపర్కౌ, సంపర్కాన్; అకారాన్తః పుంలింగః సమ్పర్కశబ్దః, ద్వి.ఏ. 5. ఉపేత్య – అవ్యయము; (ల్యబన్తము) 6. బహులావసానే – **...అవసానే,** ...అవసానయోః ...అవసానేషు; అకారాన్త నపుంసకలింగో ... అవసానశబ్దః। స.ఏ. 7. భానోః – **భానోః**, భాన్వోః, భానూనామ్; ఉకారాన్తః పుంలింగో భానుశబ్దః। ష.ఏ. 8. కరేణ – **కరేణ**, కరాభ్యామ్, కరైః; అకారాన్తః పుంలింగః కరశబ్దః, తృ.ఏ. 9. సంధుక్ష్యమాణా – **...మాణా**, ...మాణే, ...మాణాః; ఆకారాన్తః స్త్రీలింగః ...మాణాశబ్దః। ప్ర.ఏ. 10. శశాఙ్కరేఖా – **...రేఖా**, ...రేఖే, ...రేఖాః; ఆకారాన్తః స్త్రీలింగః రేఖాశబ్దః। ప్ర.ఏ. 11. చ, ఇవ – అవ్యయాలు. 12. బభౌ – క్రియ.

**సంధులు :-**

1. భానోః + బహులావసానే – భానోర్బహులావసానే – విసర్గసన్ధిః।
2. సంధుక్ష్యమాణా + ఇవ – సంధుక్ష్యమాణేవ – గుణసన్ధిః – **ఆద్గుణః**

**సమాసాలు / విగ్రహవాక్యాలు :-**

1. దీక్షావిధిసాయకేన – దీక్షాయాం విధిః, దీక్షావిధిః, తస్మిన్ సాయకః దీక్షావిధిసాయకః, తేన దీక్షావిధిసాయకేన। సప్తమీతత్పురుష సమాసః।
2. బహులావసానే – బహుళస్య అవసానం బహులావసానం, తస్మిన్ బహులావసానే। షష్ఠీతత్పురుషసమాసః।
3. సంధుక్ష్యమాణా – సంధుక్ష్యతే ఇతి సంధుక్ష్యమాణా, సముపసర్గపూర్వకాద్ 'ధుక్ష సన్దీపనక్లేశనయోః' ఇతి ధాతోః కర్మణి యక్, తదన్తాత్ శానచ్।
4. శశాఙ్కరేఖా – శశః అఙ్కః యస్య స శశాఙ్కః తస్య రేఖా శశాఙ్కరేఖా – షష్ఠీతత్పురుషసమాసః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

**1. బాలా :-** ఎ) ఆకారాన్తః స్త్రీలింగో బాలాశబ్దః।

బి) బాలా స్యాత్ షోడశాబ్దా తదుపరి తరుణీ వింశతీ యావదూర్ధ్వం ప్రౌఢా స్యాత్ పంచ పంచాశదవధి పరతో వృద్ధతాం యాతి **నారీ**।





సి) శ్లో॥ జానే తపసో వీర్యం సా **బాలా** పరవతీతి మే విదితమ్।
అలమస్మి తతో హృదయం తథాపి నేదం నివర్తయితుమ్॥

– ఇతి అభిజ్ఞానశాకున్తలే 3–2

డి) శ్లో॥ ఇయం **బాలా** మాం ప్రత్యనవరతమిన్దీవరదళ–
ప్రభాచోరం చక్షుః క్షిపతి కిమభిప్రేతమనయా।
గతో మోహోఽస్మాకం స్మరకుసుమబాణవ్యతికర–
జ్వరజ్వాలా **శాన్తా** తదపి న వరాకీ విరమతి॥

– భర్తృహరిసుభాషితే – శృంగారశతకే – 63

ఇ) An infant, a child; it usually means the young child, under five years old, but is equally applicable till sixteen years of age - Sabda - Sagara,,

ఎఫ్) శ్లో॥ కలత్రవానహం **బాలే** కనీయాంసం భజస్వ మే।
ఇతి రామో వృషస్యన్తీం వృషస్కన్ధః శశాస తామ్॥

– రఘువంశే – 12 –34

**అలంకారాలు :-** ఇట 'ఉపమాలంకార' మున్నదని చెప్పదగును.

**లక్షణమ్ :-** 'ఉపమానోపమేయయోః సాధర్మ్యే
భేదాభేదతుల్యత్వే ఉపమా – అలంకారసర్వస్వమ్ (రుయ్యక)

'ఉపమానోపమేయములకు సాధర్మ్యము భేదాభేదతుల్యముగ నున్నచో 'నుపమాలంకారమగును.

ఉపమేయము – బాలా, పార్వతీదేవి.

ఉపమానము – శశాఙ్కరేఖా

సాధర్మ్యము – భాసించుట.

'సూర్యకిరణసంపర్కముచే చంద్రరేఖ భాసించినట్లు నూతనబాణసంపర్కముచే బాలాదేవి భాసించెను అని వర్ణింపబడుటచే నిట 'ఉపమాలంకార'మున్నదని చెప్పబడినది.

**క్రియాదర్శము :- బభౌ** – 'భా – దీప్తౌ' విత్యస్మాద్ధాతోః సకర్మకాత్కర్తరి భూతే లిట్ పరస్మైపదే ప్రథమపురుషైకవచనాంతః।

**బభౌ** – బభతుః – బభుః।

శ్లో॥ స రాజ్యం గురుణా దత్తం పతిప్రద్యాధికం **బభౌ।**
దినాంతే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః॥

– రఘువంశమహాకావ్యే – 4–1

---

**అవతారిక :–** నార్యః తాం మంగలస్నానార్థం సన్మానమణ్డపం వ్యనైషుః।

**శ్లో॥ తాం లోధ్రకల్కేన హృతాఙ్గతైలా–**
**మాశ్యానకాలేయకృతాఙ్గరాగామ్।**
**వాసో వసానామభిషేకయోగ్యం**
**నార్యశ్చతుష్కాభిముఖం వ్యనైషుః॥ 9**

**పదవిభాగము :–** తామ్, లోధ్రకల్కేన, హృతాఙ్గతైలామ్, ఆశ్యానకాలేయ కృతాఙ్గరాగామ్, వాసః, వసానామ్, అభిషేకయోగ్యమ్, నార్యః, చతుష్కాభిముఖమ్, వ్యనైషుః।

**అన్వయక్రమము :–** లోధ్రకల్కేన హృతాఙ్గతైలామ్ ఆశ్యానకాలేయకృతాఙ్గరాగామ్ అభిషేకయోగ్యం వాసః వసానాం తాం నార్యః చతుష్కాభిముఖం వ్యనైషుః।

**ప్రతిపదార్థము :–** లోధ్రకల్కేన = లోధ్రవృక్షపట్టచూర్ణముతో, హృతాఙ్గతైలామ్ = నూనె జిడ్డును హరింపచేసికొన్నదియు, ఆశ్యానకాలేయకృతాఙ్గరాగామ్ = కొంచెము ఎండిన పచ్చిపసుపుతో పెట్టుకొన్న మైపూత కలదియు, అభిషేకయోగ్యమ్ = అభిషేకము చేయుటకు యోగ్యమైన, వాసః = వస్త్రమును, వసానామ్ = కప్పుకొన్నదియు అగు, తామ్ = ఆ పార్వతీదేవిని, నార్యః = ముత్తైదువలు (పతిపుత్రవత్యః), చతుష్కాభిముఖమ్ – చతుస్స్తమ్భగృహసమ్ముఖమునుగుఱించి, వ్యనైషుః = తీసికొని వెళ్ళిరి.

**తాత్పర్యము :–** లోధ్రవృక్షపట్టచూర్ణముతో నూనెజిడ్డును హరింపజేసికొన్నది, కొంచెము ఎండిన పచ్చిపసుపుతో పెట్టుకొన్న మైపూత కలదియు, అభిషేకము చేయుటకు యోగ్యమైన వస్త్రము కప్పుకొన్నదియు అగు ఆ పార్వతీదేవిని ముత్తైదువలు చతుస్స్తమ్భగృహసమ్ముఖమునుగుఱించి తీసికొనివెళ్ళిరి.



**పాఠాన్తరాలు :–**

1. ...కాలేయకృతాఙ్గ – ...కాలీయరసాఙ్గ 2. ...ముఖం – ...ముఖీం

**విభక్తులు – క్రియలు :–** 1. లోధ్రకల్కేన – **లోధ్రకల్కేన**, లోధ్రకల్కాభ్యామ్, లోధ్రకల్కైః; అకారాన్త నపుంసకలింగో లోధ్రకల్కశబ్దః। తృ.ఏ. 2. హృతాఙ్గతైలామ్ – **...తైలామ్,** ...తైలే, ...తైలాః ఆకారాన్తః స్త్రీలింగో ...తైలాశబ్దః; ద్వి.ఏ. 3. ఆశ్యానకాలేయకృతాఙ్గరాగామ్ – **...రాగామ్,** ...రాగే, ...రాగాః; ఆకారాన్తః స్త్రీలింగః, ...రాగాశబ్దః; ద్వి.ఏ. 4. అభిషేకయోగ్యమ్ – **...యోగ్యమ్,** ...యోగ్యే, ...యోగ్యాని; అకారాన్త నపుంసకలింగః ...యోగ్యశబ్దః, ద్వి.ఏ. 5. వాసః – **వాసః**, వాససీ, వాసాంసి; సకారాన్త నపుంసకలింగో వాసశ్శబ్దః, ద్వి.ఏ. 6. వసానామ్ – వసానామ్, వసానే, వసానాః; ఆకారాన్తః స్త్రీలింగో వసానాశబ్దః, ద్వి.ఏ. 7. తామ్ – **తామ్,** తే, తాః ; దకారాన్తః స్త్రీలింగ స్తచ్ఛబ్దః; ద్వి.ఏ. 8. నార్యః – నారీ, నార్యౌ, **నార్యః**; ఈకారాన్తః స్త్రీలింగో నారీశబ్దః। ప్ర.బ. 9. చతుష్కాభిముఖమ్ – **...ముఖమ్**, ...ముఖీ, ...ముఖాని; అకారాన్త నపుంసలింగో ...ముఖశబ్దః। ద్వి.ఏ. 10. వ్యనైషుః – క్రియ, లుఙ్, ప్ర.బ.

**సంధులు :–**

1. వాసః + వసానామ్ = వాసో వసానామ్ – ఉత్వాదేశః।
2. నార్యః + చతుష్కాభిముఖమ్ = నార్యశ్చతుష్కాభిముఖమ్ – శ్చుత్వసన్ధిః।
   **స్తోః శ్చునా శ్చుః** (సూ 8–4–39) సకార తవర్గములకు శకార చవర్గములతో కలయిక ఏర్పడినపుడు శకార చవర్గములు వచ్చును.

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. లోధ్రకల్కేన – లోధ్రస్య కల్కం లోధ్రకల్కం, తేన లోధ్రకల్కేన। షష్ఠీతత్పురుష సమాసః।
2. హృతాఙ్గతైలామ్ – అఙ్గస్య తైలమ్ అఙ్గతైలమ్, హృతమ్ అఙ్గతైలమ్ యస్యాః సా హృతాఙ్గతైలా, తాం హృతాఙ్గతైలామ్। బహువ్రీహిసమాసః।
3. ఆశ్యానకాలేయకృతాఙ్గరాగామ్ – అఙ్గస్య రాగః అఙ్గరాగః, ఆశ్యానం చ తత్ కాలేయమ్ ఆశ్యానకాలేయమ్, ఆశ్యానకాలేయేన కృతః అఙ్గరాగః యస్యాః సా ఆశ్యానకాలేయకృతాఙ్గరాగా, తామ్। బహువ్రీహిసమాసః।
4. అభిషేకయోగ్యమ్ – అభిషేకస్య యోగ్యమ్ అభిషేకయోగ్యమ్ తత్। షష్ఠీ తత్పురుషసమాసః।
5. చతుష్కాభిముఖమ్ – చతుష్కస్య అభిముఖమ్ చతుష్కాభిముఖమ్, తత్। ష.త।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. వసానా :–** ఎ) ఆకారాన్తః స్త్రీలింగో వసానాశబ్దః। ప్ర.ఏ.

బి) wearing / putting on (as clothes); వస్ to clothe, శానచ్ ప్రత్యయము.

సి) వసానామ్ – ద్వి.ఏ.

శ్లో॥ వసనే పరిధూసరే **వసానా** నియమక్షామముఖీ ధృతైకవేణిః।
అతినిష్కరుణస్య శుద్ధశీలా మమ దీర్ఘం విరహవ్రతం బిభర్తి॥
– అభిజ్ఞానశాకున్తలే 7-21

...అంతటా దుమ్ముకొట్టుకొనబడిన రెండు వస్త్రములను ధరించుచున్నదై, నియమము లచేత కృశించిన ముఖము కలిగినదై,...

**క్రియాదర్శము :–** వ్యనైషుః – ణీఞ్ (నీ) ప్రాపణే (తీసికొనివెళ్ళుట) సకర్మకమ్ / అకర్మకమ్ (ఉభయ) పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్ (1), లుఙ్ – ప్రథమపురుష బహువచనాంతః। వి – ఉపసర్గ

వ్యనైషీత్ – వ్యనైష్టామ్ – **వ్యనైషుః**

---

**అవతారిక :–** నార్యః పార్వతీం సవాద్యఘోషం స్నపయామాసుః –

**శ్లో॥ విన్యస్తవైఢూర్యశిలాతలేఽస్మిన్
ఆబద్ధముక్తాఫలభక్తిచిత్రే।
ఆవర్జితాష్టాపదకుమ్భతోయైః
సతూర్యమేనాం స్నపయాంబభూవుః॥ 10**

**పదవిభాగము :–** విన్యస్త ...తలే, అస్మిన్, ఆబద్ధ...చిత్రే, ఆవర్జి...తోయైః; సతూర్యమ్, ఏనామ్, స్నపయాంబభూవుః।

**అన్వయక్రమము :–** విన్యస్త...తలే ఆబద్ధ...చిత్రే అస్మిన్ ఏనామ్ ఆవర్జి... తోయైః (నార్యః) సతూర్యం స్నపయాంబభూవుః।

**ప్రతిపదార్థము :–** విన్యస్తవైఢూర్యశిలాతలే = పరువబడిన మరకతమణుల శిలా తలముగ గలదియు, ఆబద్ధముక్తాఫలభక్తిచిత్రే = కూర్పబడిన ముత్యములవరుసలచే శోభిల్లు చిత్రవర్ణము గలదియు అగు, అస్మిన్ చతుష్కాభిముఖే = ఆ నాలుగు



స్తంభముల మధ్య స్నానగృహమునందు, ఏనామ్ = ఆ పార్వతీదేవిని, ఆవర్జితాష్టాపదకుమ్భతోయైః = బంగారు కుండలనుండి జాలువారుచున్న నీటితో, (నార్యః – ముత్తైదువలు), సతూర్యమ్ = మంగళవాద్యయుక్తముగా, స్నపయాంబభూవుః = స్నానమాడించిరి.

**తాత్పర్యము :–** పరువబడిన మరకతమణుల శిలాతలముగలదియు, కూర్పబడిన ముత్యముల వరుసలచే శోభిల్లు చిత్రవర్ణముగలదియు అగు స్నానగృహమున ఆ పార్వతీదేవిని బంగారుకుండలనుండి జాలువారుచున్న నీటితో (ముత్తైదువలు) మంగళవాద్యయుక్తముగా స్నానమాడించిరి.

**పాఠాన్తరాలు :–** 1. ఆబద్ధ... – ఆవిద్ధ; 2. ...ఫలభక్తిచిత్రే – ...కృతభక్తిలేపే

**విభక్తులు – క్రియలు :–** 1. విన్యస్తవైఢూర్యశిలాతలే – **...తలే,** ...తలయోః, ...తలేషు; అకారాన్త నపుంసకలింగో ...తలశబ్దః, స.ఏ. 2. ఆబద్ధముక్తాఫలభక్తిచిత్రే – **...చిత్రే,** ...చిత్రయోః, ...చిత్రేషు; అకారాన్త నపుంసకలింగః ...చిత్రశబ్దః, స.ఏ. 3. అస్మిన్ – **అస్మిన్,** అనయోః ఏనయోః – ఏషు; మకారాన్త నపుంసకలింగః, ఇదమ్ శబ్దః, స.ఏ. 4. ఏనామ్ – **ఏనామ్,** ఏనే, ఏనాః; దకారాన్తః స్త్రీలింగ ఏతచ్ఛబ్దః, ద్వి.ఏ. 5. ఆవర్జితాష్టాపదకుమ్భతోయైః – ...తోయేన, ...తోయాభ్యామ్, **...తోయైః**; అకారాన్త నపుంసకలింగః, ...తోయశబ్దః, తృ.బ.6. సతూర్యమ్ – మంగళవాద్యయుక్తం యథా తథా క్రియావిశేషణమ్। 7. స్నపయాంబభూవుః – ణిజన్తమ్, క్రియ, లిట్.

**సంధులు :–**

1. ...తలే + అస్మిన్ – ...తలేఽస్మిన్ – పూర్వరూపసన్ధిః। **ఏఙఃపదాన్తాదతి** (సూ 6-1-05) పదాంతమందున్న ఏఓలకు హ్రస్వ అకారము పరముగా నున్నప్పుడు పూర్వపరముల స్థానమున పూర్వరూపము ఏకాదేశమగును.

**సమాసాలు :–**

1. విన్యస్తవైఢూర్యశిలాతలే – వైఢూర్యాణాం శిలాః వైఢూర్యశిలాః, తాసాం తలం వైఢూర్యశిలాతలం, విన్యస్తం వైఢూర్యశిలాతలం యస్మిన్, తస్మిన్ విన్యస్తవైఢూర్యశిలాతలే। బహువ్రీహిసమాసః।
2. ఆబద్ధముక్తాఫలభక్తిచిత్రే – ముక్తా ఇవ ఫలాని ముక్తాఫలాని। కర్మధారయః ఆ సమన్తాద్ బద్ధాని ఆబద్ధాని; 'సుప్సుపా' ఇతి సమాసః। ఆబద్ధాని చ తాని ముక్తాఫలాని ఆబద్ధముక్తాఫలాని, తేషాం భక్తయః ఆబద్ధముక్తాఫలభక్తయః తాభిః చిత్రమ్, ఆబద్ధముక్తాఫలభక్తిచిత్రమ్, తస్మిన్ ఆబద్ధముక్తాఫలభక్తిచిత్రే। తృ.త.

**అవతారిక :–** అథ మాతా మేనా ఉమాయాః ముఖమున్నమయ్య వివాహదీక్షాతిలకం చకారయతి యుగ్మకేన వర్ణ్యతే–

**శ్లో॥ అథాఙ్గులిభ్యాం హరితాలమార్ద్రం**
**మాంగల్యమాదాయ మనఃశిలాం చ।**
**కర్ణావసక్తామలదన్తపత్రం**
**మాతా తదీయం ముఖమున్నమయ్య॥ 23**

**శ్లో॥ ఉమాస్తనోద్భేదమను ప్రవృద్ధో**
**మనోరథో యః ప్రథమం బభూవ।**
**తమేవ మేనా దుహితుః కథఞ్చి–**
**ద్వివాహదీక్షాతిలకం చకార॥ 24**

**పదవిభాగము :–** అథ, అఙ్గులిభ్యామ్, హరితాలమ్, ఆర్ద్రమ్, మాంగల్యమ్, ఆదాయ, మనఃశిలామ్, చ, కర్ణావసక్తామలదన్తపత్రమ్, మాతా, తదీయమ్, ముఖమ్, ఉన్నమయ్య (23)।

ఉమాస్తనోద్భేదమ్, అను, ప్రవృద్ధః, మనోరథః యః, ప్రథమమ్, బభూవ; తమ్ ఏవ, మేనా, దుహితుః, కథఞ్చిత్, వివాహదీక్షాతిలకమ్, చకార। (24)

**అన్వయక్రమము :–** అథ మాతా మేనా మాంగల్యమ్ ఆర్ద్రం హరితాలం మనః శిలాం చ అంగులిభ్యాం ఆదాయ, కర్ణావసక్తామలదన్తపత్రం తదీయం ముఖమ్ ఉన్నమయ్య; ఉమాస్తనోద్భేదమ్ అను ప్రవృద్ధః యః మనోరథః ప్రథమం బభూవ, తమేవ దుహితుః వివాహదీక్షాతిలకం చకార।

**ప్రతిపదార్థము :–** అథ – పిమ్మట, మాతా మేనా – తల్లియగు మేనాదేవి, మాంగల్యమ్ – శుభప్రదమైన, ఆర్ద్రమ్ – ఆర్ద్రమైన, హరితాలమ్ – హరితాలమను పచ్చని వర్ణద్రవ్యమును, మనఃశిలామ్ చ – ఎఱ్ఱపాషాణమునూ, అంగులిభ్యామ్ – (చూపుడువ్రేలు – మధ్యవ్రేలు అను) రెండు వ్రేళ్ళతో, ఆదాయ – తీసికొని, కర్ణావసక్తామలదన్తపత్రమ్ – చెవులనుండి వ్రేలాడుచున్న నిర్మలమైన దన్తపత్రములు గల, తదీయమ్ ముఖమ్ – పార్వతీదేవియొక్క ఆ ముఖమును, ఉన్నమయ్య – పైకెత్తి. ఉమాస్తనోద్భేదమ్ – ఉమాదేవికి స్తనములు పొటమరించినదియును, అను – తరువాత, ప్రవృద్ధః యః – పెరిగిన కోరిక (శివుని పొందవలెనునది) ఏది, ప్రథమమ్ – మొదటిగా, బభూవ – అయ్యెనో, తమేవ – దానినే, దుహితుః –

33



పార్వతీదేవియొక్క, వివాహదీక్షాతిలకమ్ – వివాహదీక్షకు సంబంధించిన కళ్యాణతిలకమును, కథఞ్చిత్ చకార – అతి కష్టముమీద ఎట్లాగో దిద్దెను.

**తాత్పర్యము :–** పిమ్మట ఎ) తల్లియగు **మేనాదేవి** – శుభప్రదమైన, ఆర్ద్రమైన హరితాలమను పచ్చని వర్ణద్రవ్యమును, ఎఱ్ఱపాషాణము, అను ధాతువునూ రెండువ్రేళ్ళతో గ్రహించి, చెవులనుండి వ్రేలాడుచున్న నిర్మలములైన దన్తపత్రములుగల **పార్వతీదేవియొక్క ఆ ముఖమును పైకెత్తి;**

బి) ఉమాదేవికి స్తనములు పొటమరించిన తరువాత పెరిగిన కోరిక ఏది మొదటిదయ్యెనో దానినే పార్వతీదేవియొక్క వివాహదీక్షకు సంబంధించిన **కళ్యాణతిలకము**ను అతికష్టము మీద ఎట్లాగో దిద్దెను.

**పాఠాన్తరాలు :–** 1. మాంగల్య – మంగల్య; 2. ఉన్నమయ్య – ఉన్నినాయ

**విభక్తులు / క్రియలు :–** ఎ) 1. అథ, చ – అవ్యయాలు 2. మాతా – **మాతా**, మాతరౌ, మాతరః; ఋకారాన్తః స్త్రీలింగో మాతృశబ్దః। ప్ర.ఏ. 3. మేనా – **మేనా**, మేనే, మేనాః; ఆకారాన్తః స్త్రీలింగో మేనాశబ్దః। ప్ర.ఏ. 4. మాంగల్యమ్ – **మాంగల్యమ్**, మాంగల్యే, మాంగల్యాని; అకారాన్త నపుంసకలింగో మాంగల్యశబ్దః। ద్వి.ఏ. 5. ఆర్ద్రమ్ – **ఆర్ద్రమ్**, ఆర్ద్రే, ఆర్ద్రాని; అకారాన్త నపుంసకలింగ ఆర్ద్రశబ్దః। ద్వి.ఏ. 6. హరితాలమ్ – **హరితాలమ్**, హరితాలే, హరితాలాని; అకారాన్త నపుంసకలింగో హరితాలశబ్దః। ద్వి.ఏ. 7. మనఃశిలామ్ – **మనశ్శిలామ్,** మనశ్శిలే, మనశ్శిలాః; ఆకారాన్తః స్త్రీలింగో మనశ్శిలాశబ్దః। ద్వి.ఏ. 8. అంగులిభ్యామ్ – అంగుల్యా, **అంగులిభ్యామ్**, అంగులిభిః; ఇకారాన్తః స్త్రీలింగ అంగులిశబ్దః। తృ.ద్వి. 9. ఆదాయ – అవ్యయము 10. కర్ణావసక్తామలదన్తపత్రమ్ – **...పత్రమ్**, ...పత్రే, ...పత్రాణి; అకారాన్త నపుంసకలింగః, ...పత్రశబ్దః, ద్వి.ఏ. 11. ముఖమ్ – **ముఖమ్,** ముఖే, ముఖాని; అకారాన్త నపుంసకలింగో ముఖశబ్దః। ద్వి.ఏ. 12. ఉన్నమయ్య – అవ్యయము – ల్యబన్తము – ఉత్ + నమ్ + ల్యప్।

బి) 1. ఉమాస్తనోద్భేదమ్ – **...భేదమ్**, ...భేదౌ, ...భేదాన్; అకారాన్తః పుంలింగ ఉమా...భేదశబ్దః ద్వి.ఏ. 2. అను, ఏవ – అవ్యయాలు 3. ప్రవృద్ధః – **ప్రవృద్ధః,** ప్రవృద్ధౌ, ప్రవృద్ధాః; అకారాన్తః పుంలింగ, ప్రవృద్ధశబ్దః। ప్ర.ఏ. 4. యః – **యః**, యౌ, యే; అకారాన్తః పుంలింగో యచ్ఛబ్దః। ప్ర.ఏ. 5. మనోరథః – **మనోరథః**, మనోరథౌ, మనోరథాః; అకారాన్తః పుంలింగో మనోరథశబ్దః, ప్ర.ఏ 6. బభూవ – క్రియ 7. తమ్ – **తమ్**, తౌ, తాన్; దకారాన్తః పుంలింగస్తచ్ఛబ్దః। ద్వి.ఏ. 8. దుహితుః – **దుహితుః,** దుహిత్రోః, దుహితౄణామ్; ఋకారాన్తః స్త్రీలింగో దుహితృశబ్దః। ష.ఏ. 9. వివాహదీక్షాతిలకమ్ – **...తిలకమ్,** ...తిలకౌ, ...తిలకాన్; అకారాన్తః పుంలింగో వివాహ...తిలకశబ్దః। ద్వి.ఏ. 10. కథఞ్చిత్ – అవ్యయము; 11. చకార – క్రియ.

**సంధులు :–**

ఎ) 1. అథ + అంగులిభ్యామ్ – అథాఙ్గులిభ్యామ్ – సవర్ణదీర్ఘసన్ధిః।

బి) 1. ప్రవృద్ధః + మనోరథః – ప్రవృద్ధో మనోరథః – ఉత్వాదేశః।

2. మనోరథః + యః – మనోరథో యః – ఉత్వాదేశః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. కర్ణావసక్తామలదన్తపత్రమ్ – అవిద్యమానం మలం యయోః తే అమలే, నఞ్ బహువ్రీహిః। కర్ణయోః అవసక్తే కర్ణావసక్తే, తే అమలే దన్తపత్రే యస్య తత్ కర్ణావసక్తామసలదన్తపత్రం, తత్। బహువ్రీహిః।
2. ఉమాస్తనోద్భేదమ్ – ఉమాయాః స్తనౌ ఉమాస్తనౌ, తయోః ఉద్భేదః ఉమాస్తనోద్భేదః, తమ్। ష.త।
3. వివాహదీక్షాతిలకమ్ – వివాహస్య దీక్షా సంస్కారః, వివాహదీక్షా, తస్యాం తిలకః, వివాహదీక్షాతిలకః, తం వివాహదీక్షతిలకమ్। ష.త।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**తిలకమ్ :– (నపుం.)**

ఎ) తిలతి స్నిహ్యతీతి, తిల్ + 'క్వున్ శిల్పి సఞ్జ్ఞయో' – ఇతి క్వున్।

(పుం.) ఎ) తిల ఇవ కాయతీతి, కై + క। ముఖమణ్డనకః, విశేషకః, పుణ్డ్రకః...

బి) శ్లో॥ తిలకం తమాలపత్రం చిత్రకముక్తం విశేషకః పుణ్డ్రమ్।
రచితా లలాటపట్టే లలాటికా కథ్యతే రేఖా॥ 451

– అని హలాయుధకోశము '5' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ అలిభిరఞ్జనబిన్దుమనోహరైః
కుసుమపఙ్క్తినిపాతిభిరఙ్కితః।
న ఖలు శోభయతి స్మ వనస్థలీం
న **తిలక స్తిలకః** ప్రమదామివ॥ – ర.వం. 9–41

"కాటుక బొట్లవలె సుందరమగు పూలబారులమీద ఎగిరిపడు తుమ్మెదలచేత చిహ్నితమైన తిలకవృక్షము, నుదుట ధరించు తిలకము, స్త్రీల ముఖమునువలె వనస్థలిని ప్రకాశింపచేయలేదని కాదు". అంటే బాగా ప్రకాశింప చేసినదని అర్థము.

శ్లో॥ లగ్నద్విరేఫాఞ్జనభక్తిచిత్రం
ముఖే మధుశ్రీ స్తిలకం ప్రకాశ్య।





రాగేణ బాలారుణకోమలేన
చూతప్రవాళోష్ఠమలఞ్చకార॥ – కు.సం. 3 – 30

ఈ శ్లోక విపుల వివరణకు 'మృణాళినీవ్యాఖ్య' చూడదగును.

**2. మనఃశిలా (స్త్రీ.) :–** 1. ఇట కుమారసంభవమహాకావ్యమున 1వ సర్గము 55వ శ్లోకమును అనుసంధానము చేసికొనదగును. మృణాళినీ వ్యాఖ్య చూడగలరు.

శ్లో॥ గణా నమేరుప్రసవావతంసా
భూర్జత్వచః స్పర్శవతీర్దధానాః।
**మనశ్శిలా** విచ్ఛురితా నిషేదు–
శ్శైలేయనద్ధేషు శిలాతలేషు॥

**మనఃశిలః (పుం.) :–** ఇట రఘువంశమహాకావ్యమున 12వ సర్గము 80వ శ్లోకము గమనించండి.

శ్లో॥ కుమ్భకర్ణః కపీన్ద్రేణ తుల్యావస్థః స్వసుః కృతః।
రురోధ రామం శృఙ్గీవ టఙ్కచ్ఛిన్న**మనఃశిలః**॥

3. యుగ్మకమ్ – **"ద్వాభ్యాం యుగ్మమితి ప్రోక్తం త్రిభిః శ్లోకైర్విశేషకమ్।
కాలాపకం చతుర్భిః స్యాత్తదూర్ధ్వం కులకమ్ స్మృతమ్॥"** అని లక్షణము.

**క్రియాదర్శము :– చకార** – ఈ సర్గము – 7వ శ్లోకవ్యాఖ్యాన భాగము చూడగలరు.

---

**అవతారిక :–** మాత్రా కర్తవ్యం కౌతుకహస్తసూత్రబన్ధనమపి ధాత్రీ సహాయేన కృతవతీ।

**శ్లో॥ బబన్ధ చాస్రాకులదృష్టిరస్యాః
స్థానాన్తరే కల్పితసన్నివేశమ్।
ధాత్ర్యఙ్గులీభిః ప్రతిసార్యమాణ–
మూర్ణామయం కౌతుకహస్తసూత్రమ్॥ 25**

**పదవిభాగము :–** బబన్ధ, చ, అస్రాకులదృష్టిః, అస్యాః, స్థానాన్తరే, కల్పితసన్నివేశమ్, ధాత్ర్యఙ్గులీభిః, ప్రతిసార్యమాణమ్, ఊర్ణామయమ్, కౌతుకహస్తసూత్రమ్।

**అన్వయక్రమము :–** అస్రాకులదృష్టిః (మేనా) అస్యాః స్థానాన్తరే కల్పితసన్నివేశం ధాత్ర్యఙ్గులీభిః ప్రతిసార్యమాణమ్ ఊర్ణామయమ్ కౌతుకహస్తసూత్రం బబన్ధ చ।

**ప్రతిపదార్థము :–** అస్రాకులదృష్టిః – ఆనందబాష్పములచే వ్యాకులమైన దృష్టిగల, సా – ఆ మేనాదేవి, అస్యాః – ఈ పార్వతీదేవియొక్క, స్థానాన్తరే – వేఱొకస్థానమున (చేతికి కట్టవలసిన స్థానమునందు కాక) కల్పితసన్నివేశమ్ – కట్టబోవుచున్నదానిని, ధాత్ర్యఙ్గులీభిః – దాది తనవ్రేళ్లతో, ప్రతిసార్యమాణమ్ – సరియగు స్థానమును గుర్తించి జరుపగా, ఊర్ణామయమ్ – గొఱ్ఱెబొచ్చుతో నిర్మితమైన, కౌతుకహస్త సూత్రమ్ – వివాహదీక్షాహస్తసూత్రమును, బబన్ధ చ – కట్టినది.

**తాత్పర్యము:–** ఆనందబాష్పములచే వ్యాకులమైన దృష్టిగల ఆ మేనాదేవి – ఈ పార్వతీదేవి చేతికి కట్టవలసిన స్థానమునందుకాక వేఱొక స్థానమున కట్టబోవుచున్న దానిని దాది తన వ్రేళ్లతో సరియగు స్థానమునకు జరుపగా గొఱ్ఱెబొచ్చుతో నిర్మితమైన వివాహదీక్షాహస్తసూత్రమును కట్టినది.

**పాఠాన్తరాలు:–** 1. సన్నివేశమ్ – సంనివేశామ్।

**విభక్తులు / క్రియలు :–** 1. అస్రాకులదృష్టిః – దృష్టిః, **...దృష్టీ**, దృష్టయః, ఇకారాన్తః స్త్రీలింగః ...దృష్టిశబ్దః, ప్ర.ప. 2. అస్యాః – **అస్యాః**, అనయోః. ఆసామ్; మకారాన్తః స్త్రీలింగ ఇదమ్ శబ్దః, ష.ఏ. 3. స్థానాన్తరే – **స్థానాన్తరే**, స్థానాన్తరయోః, స్థానాన్తరేషు; అకారాన్త నపుంసకలింగః స్థానాన్తరశబ్దః స.ఏ. 4. కల్పితసన్నివేశమ్ – **కల్పితసన్నివేశమ్**, కల్పితసన్నివేశే, కల్పితసన్నివేశాని; అకారాన్త నపుంసకలింగః, ...సన్నివేశశబ్దః, ద్వి.ఏ. 5. ధాత్ర్యఙ్గులీభిః – ...అఙ్గుల్యా, ...అఙ్గులీభ్యామ్, **...అఙ్గులీభిః** ; ఈకారాన్తః స్త్రీలింగో ధాత్ర్యఙ్గులీశబ్దః, తృ.బ. 6. ప్రతిసార్యమాణమ్ – **...మాణమ్**, ...మాణే, ...మాణాని; అకారాన్త నపుంసకలింగః ప్రతిసార్యమాణశబ్దః, ద్వి.ఏ. 7. ఊర్ణామయమ్ – **ఊర్ణామయమ్**, ఉర్ణామయే, ఊర్ణామయాని; అకారాన్త నపుంసకలింగ ఊర్ణామయశబ్దః, ద్వి.ఏ. 8. కౌతుకహస్తసూత్రమ్ – **...సూత్రమ్**, ...సూత్రే, ...సూత్రాణి; అకారాన్తః నపుంసకలింగః కౌతుకహస్తసూత్రశబ్దః, ద్వి.ఏ. 9. బబన్ధ – క్రియ.

**సంధులు :–**

1. స్థాన + అన్తరే – స్థానాన్తరే – స.దీ.సన్ధిః।
2. ధాత్రీ + అఙ్గులీభిః – ధాత్ర్యఙ్గులీభిః – యణాదేశసన్ధిః।
3. చ + అస్రాకుల ...– చాస్రాకుల... – సవర్ణదీర్ఘసన్ధిః।
4. ...దృష్టిః + అస్యాః – ...దృష్టిరస్యాః – విసర్గసన్ధిః।





**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. అస్రాకులదృష్టిః – అస్రైః ఆకులా అస్రాకులా, అస్రాకులా దృష్టిః యస్యాస్యా అస్రాకులదృష్టిః, బహువ్రీహిః
2. స్థానాన్తరే – అన్యత్ స్థానం స్థానాన్తరం, తస్మిన్ స్థానాన్తరే, మయూరవ్యం సకాదిసమాసః।
3. కల్పితసన్నివేశమ్ – కల్పితః సన్నివేశః యస్య తత్ కల్పితసన్నివేశమ్, తత్ బహువ్రీహిః।
4. ధాత్ర్యాః అఙ్గుల్యః ధాత్ర్యఙ్గుల్యః, తాభిః ధాత్ర్యఙ్గులీభిః। ష.త।
5. ప్రతిసార్యమాణమ్ – ప్రతిసార్యతే ఇతి ప్రతిసార్యమాణం, తత్, కర్మణి యక్, తదన్తాత్ శానచ్। ఉపపదసమాసః।
6. ఊర్ణామయమ్ – ప్రచురా ఊర్ణాః యస్మిన్ తద్ ఊర్ణామయం, తత్। ప్రాచుర్యేఽర్థే మయట్। బహువ్రీహిః।
7. కౌతుకహస్తసూత్రమ్ – హస్తస్య సూత్రం, హస్తసూత్రం, కౌతుకార్థం హస్తసూత్రం, కౌతుకహస్తసూత్రం, తత్। చ.త।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**ఊర్ణా**:– (స్త్రీ.) – ఎ) ఊర్ణోతేర్డః – 5.47 ఇతి డః।

బి) ఊర్ణోత్యాచ్ఛాదయతి యయా సా ఊర్ణా – మేషాదిలోమాని

సి) ఇట రఘువంశమహాకావ్యమున – కుముద్వతీ – కుశుల వివాహసందర్భాన్ని – అనుసంధానము చేసికొనదగును.

శ్లో॥ తస్యాః స్పృష్టే మనుజపతినా సాహచర్యాయ హస్తే
మాఙ్గల్యోర్ణావలయిని పురః పావకస్యోచ్ఛిఖస్య।
దివ్యస్తూర్యధ్వనిరుదచరద్వ్యశ్నువానో దిగన్తాన్
గన్ధోదగ్రం తదను వవృషుః పుష్పమాశ్చర్యమేఘాః॥

– రఘువంశమహాకావ్యే 16 –87

“సహధర్మచారిణి అగుటకై మంగళప్రదమైన గొఱ్ఱె **వెంట్రుకలచేత** తయారు చేయబడిన సూత్రకంకణముగల **కుముద్వతి** యొక్క హస్తమును ప్రజ్వలించుచున్న

అగ్నిసాక్షికముగా కుశుడు పట్టుకొనగానే దిక్కులు పిక్కటిల్లునట్లు దేవతల మంగళ వాద్యధ్వనులు దిగంతములవఱకు వ్యాపించినవి. వెంటనే మేఘములు పరిమళ భరితమైన పుష్పవృష్టిని కురిపించినవి – జె.వి.యస్. శర్మగారు

**క్రియాదర్శము :–** బబన్ధ – దీనికై 17వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడగలరు.

---

**అవతారిక :–** నవదుకూలనివాసినీ గృహీతదర్పణా పార్వతీ భూయిష్ఠం బభౌ –

**శ్లో॥ క్షీరోదవేలేవ సఫేనపుఞ్జా**
**పర్యాప్తచన్ద్రేవ శరత్త్రియామా।**
**నవం నవక్షౌమనివాసినీ సా**
**భూయో బభౌ దర్పణమాదధానా॥ 26**

**పదవిభాగము :–** క్షీరోదవేలా, ఇవ, సఫేనపుఞ్జా, పర్యాప్తచన్ద్రా, ఇవ, శరత్త్రియామా, నవమ్, నవక్షౌమనివాసినీ, సా, భూయః, బభౌ, దర్పణమ్, ఆదధానా।

**అన్వయక్రమము :–** నవక్షౌమనివాసినీ నవం దర్పణమ్ ఆదధానా సా సఫేన పుంజా క్షీరోదవేలా ఇవ, పర్యాప్తచన్ద్రా శరత్త్రియామా ఇవ (చ) భూయః బభౌ।

**ప్రతిపదార్థము :–** నవక్షౌమనివాసినీ – నూతనమైన తెల్లని పట్టుబట్టలను ధరించినదియు, నవమ్ – క్రొత్తదైన, దర్పణమ్ ఆదధానా – అద్దమును పట్టుకొని చూచుకొనుచున్నదియును అగు, సా – ఆ పార్వతీదేవి, సఫేనపుంజా – నురగతోకూడిన, క్షీరోదవేలా ఇవ – పాలసముద్రపు చెలియలి కట్టవలెను, పర్యాప్తచన్ద్రా – పూర్ణచంద్రుడు కల, శరత్త్రియామా ఇవ – శరత్కాలపురాత్రివలెను, భూయః – మిగుల, బభౌ – ప్రకాశించెను.

**తాత్పర్యము :–** నూతనమైన తెల్లని పట్టుబట్టలను ధరించినదియు, క్రొత్తదైన అద్దమును పట్టుకొని చూచుకొనుచున్నదియు అగు ఆ పార్వతీదేవి – 1) నురగతోకూడిన పాలసముద్రపు చెలియలి కట్టవలెను 2) పూర్ణచంద్రుడుగల శరత్కాలపు రాత్రివలెను – మిగుల ప్రకాశించెను.

**విభక్తులు / క్రియలు :–** 1. నవక్షౌమనివాసినీ – **...నివాసినీ**, ...నివాసిన్యౌ, ...నివాసిన్యః, ఈకారాన్తః స్త్రీలింగో నవక్షౌమనివాసినీశబ్దః, ప్ర.ఏ. 2. నవమ్ – **నవమ్**, నవే, నవాని; అకారాన్త నపుంసకలింగో నవశబ్దః, ద్వి.ఏ. 3. దర్పణమ్ – **దర్పణమ్**, దర్పణే, దర్పణాని; అకారాన్త

36



నపుంసకలింగో దర్పణశబ్దః, ద్వి.ఏ. 4. ఆదధానా – **ఆదధానా**, ఆదధానే, ఆదధానాః; ఆకారాన్తః స్త్రీలింగ ఆదధానాశబ్దః, ప్ర.ఏ. 5. సా – **సా,** తే, తాః; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః, ప్ర.ఏ. 6. సఫేనపుంజా – **...పుంజా**, ...పుంజే, ...పుంజాః; ఆకారాన్తః స్త్రీలింగస్సఫేనపుంజాశబ్దః, ప్ర.ఏ. 7. క్షీరోదవేలా – **...వేలా**, ...వేలే, ...వేలాః; ఆకారాన్తః స్త్రీలింగః క్షీరోదవేలాశబ్దః, ప్ర.ఏ. 8. పర్యాప్తచన్ద్రా –**...చన్ద్రా**, ...చన్ద్రే, ...చన్ద్రాః; ఆకారాన్తః స్త్రీలింగః పర్యాప్తచన్ద్రాశబ్దః, ప్ర.ఏ. 9. శరత్త్రియామా – **...త్రియామా**, ...త్రియామే, ...త్రియామాః; ఆకారాన్తః స్త్రీలింగః శరత్త్రియామాశబ్దః, ప్ర.ఏ. 10. ఇవ – అవ్యయము. 11. భూయః – అవ్యయము 12. బభౌ – క్రియ – 'భా – దీప్తౌ' ఇతి ధాతోర్లిటి।

**సంధులు :–**

1. క్షీరోదవేలా + ఇవ – క్షీరోదవేలేవ – గుణసన్ధిః।
2. పర్యాప్తచన్ద్రా + ఇవ – పర్యాప్తచన్ద్రేవ – గుణసన్ధిః।
3. భూయః + బభౌ – భూయో బభౌ – ఉత్వాదేశః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. నవక్షౌమనివాసినీ – నవం చ తత్ క్షౌమం నవక్షౌమం, తద్ నివస్తే ఇతి నవక్షౌమనివాసినీ। 'వస – ఆచ్ఛాదనే' ఇతి ధాతోర్ణినిః। కృద్వృత్తిః।
2. సఫేనపుఞ్జా – ఫేనానాం పుఞ్జః ఫేనపుఞ్జః తేన సహితా సఫేనపుంజా। తృ.త.।
3. క్షీరోదవేలా – క్షీరమ్ ఉదకం యస్య సః క్షీరోదః, క్షీరోదస్య వేలా క్షీరోదవేలా – ష.త.।
4. పర్యాప్తచన్ద్రా – పర్యాప్తః చన్ద్రః యస్యాం సా పర్యాప్తచన్ద్రా। బహుప్రీహిః।
5. శరత్త్రియామా – త్రయః యామాః యస్యాః సా త్రియామా, శరదః త్రియామా శరత్త్రియామా। ష.త.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. వేలా :–** (స్త్రీ.) ఎ) వేల్యతేఽనయేతి। వేల్ + 'గురోశ్చ హలః'। ఇత్యంతతష్టాప్। సముద్రజలవికారః; వారివృద్ధిః।

బి) శ్లో॥ ...వేలా వృద్ధిశ్చ వారిణః॥ – Tide, Flow, current, also sea - coast, sea shore అని హలాయుధకోశము '2' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ సంరమ్భం మైథిలీహాసః క్షణసౌమ్యాం నినాయ తామ్।
నివాతస్తిమితాం **వేలాం** చన్ద్రోదయ ఇవోదధేః॥
- ఇతి రఘువంశమహాకావ్యే - 12-36

...చంద్రోదయము సముద్రమును కల్లోలపరచునట్లు కలచివైచెను.

డి) '**వేలా** కాలే చ జలధేస్తీరనీవికారయోః' ఇతి విశ్వః।

**అలంకారములు :-** ఇట 'ఉపమాలంకార'మున్నదని చెప్పదగును.

**క్రియాదర్శము :- బభౌ :-** 'భా - దీప్తౌ' (ప్రకాశించుట), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ,అదాదయః (2); లిట్ - ప్రథమపురుషైకవచనాంతః।

**బభౌ** - బభతుః - బభుః

---

**అవతారిక :-** అథ మాతా కులదేవతావందనం పతివ్రతాపాదగ్రహణం చ కారయామాస।

**శ్లో॥ తామర్చితాభ్యః కులదేవతాభ్యః**
**కులప్రతిష్ఠాం ప్రణమయ్య మాతా।**
**అకారయత్కారయితవ్యదక్షా**
**క్రమేణ పాదగ్రహణం సతీనామ్॥ 27**

**పదవిభాగము :-** తామ్, అర్చితాభ్యః, కులదేవతాభ్యః, కులప్రతిష్ఠామ్, ప్రణమయ్య మాతా, అకారయత్, కారయితవ్యదక్షా, క్రమేణ, పాదగ్రహణమ్, సతీనామ్।

**అన్వయక్రమము :-** కారయితవ్యదక్షా మాతా కులప్రతిష్ఠాం తామ్ అర్చితాభ్యః కులదేవతాభ్యః ప్రణమయ్య సతీనాం పాదగ్రహణం క్రమేణ అకారయత్।

**ప్రతిపదార్థము :-** కారయితవ్యదక్షా - చేయవలసిన పనులకు తగిన ఉపదేశముల నిచ్చుటయందు కుశలురాలైన, మాతా - తల్లియగు మేనాదేవి, కులప్రతిష్ఠామ్ - కులమున కాలంబనభూతురాలైన, తామ్ - ఆ పార్వతీదేవిని, అర్చితాభ్యః - పూజింపబడువారైన, కులదేవతాభ్యః - కులదేవతలందఱి కొఱకు, ప్రణమయ్య - ప్రణామము చేయించి, సతీనామ్ - పతివ్రతలగు ముత్తైదువలకు, పాదగ్రహణమ్ - చరణాభివందనమును, క్రమేణ - వేదశాస్త్రోక్తవిధితో / వరుసగా, అకారయత్ - చేయించెను.





**తాత్పర్యము :-** చేయవలసిన పనులు చేయించుటయందు కుశలురాలగు తల్లియైన మేనాదేవి - కులమున కాలంబనభూతురాలైన ఆ పార్వతీదేవిని పూజింపబడువారైన కులదేవతలందఱకు ప్రణామము చేయించి పతివ్రతలగు ముత్తైదువలకు చరణాభివందనమును వేదశాస్త్రోక్తవిధితో చేయించెను.

**విభక్తులు / క్రియలు :-** 1. కారయితవ్యదక్షా - **...దక్షా**, ...దక్షే, ...దక్షాః; ఆకారాన్తః స్త్రీలింగః కారయితవ్యదక్షాశబ్దః। ప్ర.ఏ. 2. మాతా - **మాతా**, మాతరౌ, మాతరః; ఋకారాన్తః స్త్రీలింగో మాతృశబ్దః ప్ర.ఏ. 3. కులప్రతిష్ఠామ్ - **...ప్రతిష్ఠామ్**, ....ప్రతిష్ఠే, ...ప్రతిష్ఠాః; ఆకారాన్తః స్త్రీలింగః కులప్రతిష్ఠాశబ్దః ద్వి.ఏ. 4. తామ్ - **తామ్**, తే, తాః; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః, ద్వి.ఏ. 5. అర్చితాభ్యః - అర్చితాయై, అర్చితాభ్యామ్, **అర్చితాభ్యః**; ఆకారాన్తః స్త్రీలింగ అర్చితాశబ్దః, చ.బ. 6. కులదేవతాభ్యః - కులదేవతాయై, కులదేవతాభ్యామ్, **కులదేవతాభ్యః**; ఆకారాన్తః స్త్రీలింగః కులదేవతాశబ్దః, చ.ఏ. 7. ప్రణమయ్య - అవ్యయము (ల్యబన్తమ్) 8. సతీనామ్ - **సత్యాః**, సత్యోః, సతీనామ్; ఈకారాన్తః స్త్రీలింగః, సతీశబ్దః , ష.బ. 9. పాదగ్రహణమ్ - **పాదగ్రహణమ్**, పాదగ్రహణే, పాదగ్రహణాని; అకారాన్త నపుంసకలింగః పాదగ్రహణశబ్దః, ద్వి.ఏ. 10. క్రమేణ - **క్రమేణ**, క్రమాభ్యామ్, క్రమైః; అకారాన్తః పుంలింగః క్రమశబ్దః, తృ.ఏ. 11. అకారయత్ - క్రియ. 'డుకృఞ్ - కరణే' ఇతి ధాతోః లఙ్।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :-**

1. కారయితవ్యదక్షా - కారయితుం యోగ్యాని కారయితవ్యాని తేషు దక్షా కారయితవ్యదక్షా। ణిజన్తాత్, 'డుకృఞ్కరణే' ఇతి ధాతోః తవ్యప్రత్యయః, తతః **సప్తమీతత్పురుషః॥**
2. కులప్రతిష్ఠామ్ - కులస్య ప్రతిష్ఠా కులప్రతిష్ఠా, తాం కులప్రతిష్ఠామ్। ష.త.
3. కులదేవతాభ్యః - కులస్య దేవతాః కులదేవతాః, తాభ్యః కులదేవతాభ్యః, ష.త.
4. ప్రణమయ్య - ప్రోపసర్గపూర్వకాత్ 'ణమప్రహ్వత్వేశబ్దే చ' ఇతి ధాతోః క్త్వాప్రత్యయః తస్య ల్యబాదేశః। 'ల్యపి లఘు పూర్వాత్' ఇతి ణేరయాదేశః।
5. పాదగ్రహణమ్ - పాదయోః గ్రహణమ్ పాదగ్రహణమ్ తత్। ష.త.

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. కులమ్ :-** (నపుం.) -

ఎ) కుల్ + 'ఇగుపధేతి'క। గృహమ్। వంశః।

బి) శ్లో॥ 'అన్వవాయోఽన్వయో వంశో గోత్రం చాభిజనః **కులమ్'**
- అని హలాయుధకోశము - '6' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ ఆచారో వినయో విద్యా ప్రతిష్ఠా తీర్థదర్శనమ్।
నిష్ఠా వృత్తిస్తపో దానం నవధా కులలక్షణమ్॥ - ఇతి శిష్టోక్తౌ

డి) శ్లో॥ ఇత్యూచివానుపహృతాభరణం క్షితీశం
శ్లాఘ్యో భవాన్ స్వజన ఇత్యనుభాషితారమ్।
సంయోజయాం విధివదాస సమేతబన్ధుః
కన్యామయేన కుముదః **కుల**భూషణేన ॥ - ర.వం. 16-86

"...కుముదుడు ఉభయవంశములకును భూషణమైన తన చెల్లెలిని ఇచ్చి శాస్త్రోక్తముగా కుశునకు వివాహము జరిపించెను."

ఇ) ప్రాయేణ చ సత్స్వన్యేషు వరగుణేష్వభిజనమేవానురుధ్యన్తే ధీమన్తః। - హర్షచరితే

యఫ్) అవినీతకుమారం హి **కుల**మాశు వినశ్యతి। - శుక్రనీతి, 2-25

జి) లోకే **కులం కులం** తావద్యావత్పూర్వసమన్వయః।
గుణప్రభావే విచ్ఛిన్నే సమాప్తం సకలం **కులమ్॥** -దర్పదలనే 1-10

**క్రియాదర్శము :- అకారయత్** - ణిజన్తాత్, 'డుకృఞ్ - కరణే' ఇతి ధాతోర్లఙ్। 'హృక్రోరన్యతరస్యామ్' ఇత్యణి కర్తుః కర్మత్వమ్। అన్యత్ర చ 'గతిబుద్ధిప్రత్యయవసనార్థ శబ్ద కర్మాకర్మకాణామణికర్తా సణౌ' ఇతి నమేరకర్మకత్వాత్। - అని పుంసవనీవ్యాఖ్య.

**అకారయత్** - అకరాయతామ్ - అకారయన్

---

**అవతారిక :-** నమ్రా పార్వతీ 'పత్యుః అఖణ్డితం ప్రేమ లభస్వ' ఇతి తాభిః ఉచ్యతే స్మ -

**శ్లో॥ అఖణ్డితం ప్రేమ లభస్వ పత్యుః**
**ఇత్యుచ్యతే తాభిరుమా స్మ నమ్రా।**
**తయా తు తస్యార్ధశరీరభాజా**
**పశ్చాత్కృతాః స్నిగ్ధజనాశిషోఽపి॥ 28**

**పదవిభాగము :-** అఖడ్డితమ్, ప్రేమ, లభస్వ, పత్యుః, ఇతి, ఉచ్యతే, తాభిః, ఉమా, స్మ, నమ్రా, తయా, తు, తస్య, అర్ధశరీరభాజా, పశ్చాత్, కృతాః, స్నిగ్ధజనాశిషః, అపి।





**అన్వయక్రమము :-** నమ్రా ఉమా తాభిః 'పత్యుః అఖణ్డితం ప్రేమ లభస్వ' ఇతి ఉచ్యతే స్మ। తస్య అర్ధశరీరభాజా తయా తు స్నిగ్ధజనాశిషః అపి పశ్చాత్ కృతాః।

**ప్రతిపదార్థము :-** నమ్రా - నమ్రయైన, ఉమా - ఉమాదేవి, తాభిః - ఆ పతివ్రతలచే, 'పత్యుః - భర్తయొక్క, అఖణ్డితమ్ - అఖణ్డితమైన, ప్రేమ - ప్రేమను, లభస్వ' - పొందుము' ఇతి - అని, ఉచ్యతే స్మ - ఆశీర్వదింపబడినదాయెను. తస్య - శివునియొక్క, అర్ధశరీరభాజా - శరీరమున సగము భాగమును పొందినదైన, తయా తు - ఆ పార్వతీదేవిచేత, స్నిగ్ధజనాశిషః + అపి - బంధుజనులిచ్చిన ఆశీర్వచనములున్ను, పశ్చాత్ కృతాః - వెనుకబడినవిగా అయినవి.

**తాత్పర్యము :-** నమ్రయైన ఉమాదేవి - ఆ పతివ్రతలచే 'భర్తయొక్క అఖణ్డితమైన ప్రేమను పొందుము' అని ఆశీర్వదింపబడినదాయెను. శివునియొక్క శరీరమున నగభాగమును పొందినదైన ఆ పార్వతీదేవిచేత బంధుజనులిచ్చిన ఆశీర్వచనములున్ను వెనుకబడినవిగా అయినవి.

**విభక్తులు / క్రియలు :-** 1. నమ్రా - **నమ్రా,** నమ్రే, నమ్రాః; ఆకారాన్తః స్త్రీలింగో నమ్రాశబ్దః ప్ర.ఏ. 2. ఉమా - **ఉమా**, ఉమే, ఉమాః; ఆకారాన్తః స్త్రీలింగ ఉమాశబ్దః, ప్ర.ఏ. 3. తాభిః - తయా, తాభ్యామ్, **తాభిః**; దకారాన్తః స్త్రీలింగః స్తచ్ఛబ్దః, తృ.బ. 4. పత్యుః - **పత్యుః**, పత్యోః, పతీనామ్; ఇకారాన్తః పుంలింగః పతిశబ్దః, ష.ఏ. 5. అఖణ్డితమ్ - **అఖణ్డితమ్**, అఖణ్డితే, అఖణ్డితాని; అకారాన్త నపుంసకలింగ అఖణ్డితశబ్దః, ప్ర.ఏ. 6. ప్రేమ - **ప్రేమ**, ప్రేమణీ, ప్రేమాణి; నకారాన్త నపుంసకలింగః ప్రేమన్శబ్దః, ప్ర.ఏ. 7. లభస్వ - క్రియ - లోట్ - మ.ఏకవచనాంతః 8. ఇతి - అవ్యయము 9. ఉచ్యతే స్మ - క్రియ 'లట్ స్మే' ఇతి భూతార్థే లట్। 10. తస్య - **తస్య**, తయోః, తేషామ్; దకారాన్తః పుంలింగ స్తచ్ఛబ్దః, ష.ఏ. 11. అర్ధశరీరభాజా - **...భాజా**, ...భాగ్భ్యామ్, ...భాగ్భిః; జకారాన్తః స్త్రీలింగ అర్ధ...భాక్శబ్దః, తృ.ఏ. 12. తయా - **తయా**, తాభ్యామ్, తాభిః; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః , తృ.ఏ 13. తు, అపి, పశ్చాత్ - అవ్యయాలు 14. స్నిగ్ధజనాశిషః - ...ఆశీః, ...ఆశిషౌ, **...ఆశిషః** ; షాన్తః స్త్రీలింగ...ఆశిశ్శబ్దః, ప్ర.బ. - పిపఠీశ్శబ్దవత్। 15. కృతాః - **కృతా**, కృతే, కృతాః; ఆకారాన్తః స్త్రీలింగః కృతాశబ్దః, ప్ర.బ.

**సంధులు :-**

1. ఇతి + ఉచ్యతే - ఇత్యుచ్యతే - యణాదేశసన్ధిః।
2. తాభిః + ఉమా - తాభిరుమా - విసర్గసన్ధిః।
3. తస్య + అర్ధ... - తస్యార్ధ...- సవర్ణదీర్ఘసన్ధిః।
4. స్నిగ్ధజన + ఆశిషః - స్నిగ్ధజనాశిషః - స.దీ.సన్ధిః।
5. ఆశిషః + అపి - ఆశిషోఽపి - ఉత్వాదేశము + పూర్వరూపసన్ధిః।

**సమాసాలు :-**

1. అర్ధశరీరభాజా – శరీరస్య అర్ధమ్ – అర్ధశరీరమ్, అర్ధశరీరమ్ భజతీతి అర్ధశరీరభాక్ తయా అర్ధశరీరభాజా। కృద్వృత్తిః।
2. స్నిగ్ధజనాశిషః – స్నిగ్ధాశ్చ తే జనాః స్నిగ్ధజనాః తేషాం ఆశిషః స్నిగ్ధజనాశిషః । ష.త.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

**1. నమ్రః –**

ఎ) నమ్రః, నమ్రా, నమ్రమ్ –

బి) నమతీతి, ణమ్ 'నమికమ్పీతి' ర। నతః।

సి) "...నతం **నమ్రం** చ బన్ధురమ్" 760

– అని హలాయుధకోశము '3' నామములను పేర్కొన్నది.

డి) శ్లో॥ **యన్నమ్రం** సరలఞ్చాపి యచ్చాపత్సు న సీదతి।
ధనుర్మిత్రం కలత్రం చ దుర్లభం శుద్ధవంశజమ్॥
– ఇతి పఞ్చతన్త్రే – 2– 189

ఇ) శ్లో॥ భవన్తి **నమ్రా**స్తరవః ఫలోద్గమైః
నవామ్బుభిర్దూరవిలంబినో ఘనాః।
అనుద్ధతాస్సత్పురుషాస్సమృద్ధిభిః
స్వభావ ఏవైష పరోపకారిణామ్॥ – ఇతి అభిజ్ఞానశాకున్తలే 5–12

**క్రియాదర్శము :- 1. లభస్వ** – 'డులభష్ ప్రాప్తౌ' (పొందుట), భ్వాదయః (1), సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ, లోట్ – మధ్యమపురుషైకవచనాంతః।

**లభస్వ** – లభేథామ్ – లభధ్వమ్

శ్లో॥ ఆశాస్యమన్యత్పునరుక్తభూతం
శ్రేయాంసి సర్వాణ్యధిజగ్ముషస్తే।
పుత్రం **లభస్వా**త్మగుణానురూపం
భవన్తమీడ్యం భవతః పితేవ॥ – ర.వం.. 5–34

---





**అవతారిక :-** హిమవాన్ సుతాయాః సర్వమపి కర్తవ్యం కారయిత్వా సుహృద్భిః సహ సభాయాం హరాగమనం ప్రతీక్షమాణః తస్థౌ –

**శ్లో॥ ఇచ్ఛావిభూత్యోరనురూపమద్రిః**
**తస్యాః కృతీ కృత్యమశేషయిత్వా।**
**సభ్యః సభాయాం సుహృదాస్థితాయాం**
**తస్థౌ వృషాఙ్కాగమనప్రతీక్షః॥** **29**

**పదవిభాగము :-** ఇచ్ఛావిభూత్యోః, అనురూపమ్, అద్రిః, తస్యాః, కృతీ, కృత్యమ్, అశేషయిత్వా, సభ్యః, సభాయామ్, సుహృదాస్థితాయామ్, తస్థౌ, వృషాఙ్కాగమన ప్రతీక్షః

**అన్వయక్రమము :-** కృతీ సభ్యః అద్రిః ఇచ్ఛావిభూత్యోః అనురూపం తస్యాః కృత్యమ్ అశేషయిత్వా సుహృదాస్థితాయాం సభాయాం వృషాఙ్కాగమనప్రతీక్షః (సన్) తస్థౌ।

**ప్రతిపదార్థము :-** కృతీ – కుశలుడును, సభ్యః – సంస్కారవంతుడును అగు, అద్రిః – హిమవంతుడు, ఇచ్ఛావిభూత్యోః – కోరికకు సంపదకు, అనురూపమ్ – తగినట్లుగా, తస్యాః – ఆ పార్వతీదేవికి, కృత్యమ్ – చేయవలసిన వివాహసంబంధ మంగళ కార్యములను, అశేషయిత్వా – పూర్తిచేసి, సుహృదాస్థితాయామ్ – బంధుజనలందఱితో నిండియున్న, సభాయామ్ – రాజసభయందు, వృషాఙ్కాగమన ప్రతీక్షః (సన్) – వృషభధ్వజుడైన హరాగమనమునకై ఎదురుచూచువాడగుచు, తస్థౌ – ఉండెను.

**తాత్పర్యము :-** కుశలుడును, సంస్కారవంతుడును అగు హిమవంతుడు, కోరికకు సంపదకు తగినట్లుగా ఆ పార్వతీదేవికి చేయవలసిన వివాహసంబంధ మంగళ కార్యములను పూర్తిచేసి బంధుజనలందఱితో నిండియున్న రాజసభయందు వృషభధ్వజుడైన హరాగమనమునకై ఎదురుచూచువాడగుచు ఉండెను.

**పాఠాన్తరాలు :-** 1. ...గమనప్రతీక్షః। – ...గమనం ప్రతీక్ష్య।

**విభక్తులు / క్రియలు :-** 1. కృతీ – **కృతీ**, కృతినౌ, కృతినః; నకారాన్తః పుంలింగః కృతిన్‌శబ్దః ప్ర.ఏ. ('శబ్దసాగర'నుండి) 2. సభ్యః – **సభ్యః**, సభ్యౌ, సభ్యాః; అకారాన్తః పుంలింగః, ప్ర.ఏ. 3. అద్రిః – **అద్రిః**, అద్రీ, అద్రయః; ఇకారాన్తః పుంలింగ అద్రిశబ్దః, ప్ర.ఏ. 4. ఇచ్ఛావిభూత్యోః – ...విభూత్యాః, **...విభూత్యోః**, ...విభూతీనామ్; ఇకారాన్తః స్త్రీలింగః ఇచ్ఛావిభూతిశబ్దః, ష.ద్వి. 5. అనురూపమ్ – **అనురూపమ్**, అనురూపే, అనురూపాణి; అకారాన్త నపుంసకలింగ అనురూపశబ్దః

ప్ర.ఏ. 6. తస్యాః - **తస్యాః**, తయోః, తాసామ్; దకారాన్తః స్త్రీలింగ స్తచ్ఛబ్దః, ష.ఏ. 7. కృత్యమ్ - **కృత్యమ్**, కృత్యే, కృత్యాని; అకారాన్త నపుంసకలింగ కృత్యశబ్దః, ప్ర.ఏ. 8. అశేషయిత్వా - క్త్వాప్రత్యయాన్తము 9. సుహృదాస్థితాయామ్ - **...స్థితాయామ్**, ...స్థితయోః, ...స్థితాసు; ఆకారాన్తః స్త్రీలింగః ...స్థితాశబ్దః, స.ఏ. 10. సభాయామ్ - **సభాయామ్**, సభయోః, సభాసు; ఆకారాన్తః స్త్రీలింగః సభాశబ్దః, స.ఏ. 11. వృషాఙ్కాగమనప్రతీక్షః - **...ప్రతీక్షః**, ప్రతీక్షౌ, ప్రతీక్షాః; అకారాన్తః పుంలింగో వృషాఙ్కాగమనప్రతీక్షశబ్దః, ప్ర.ఏ. 12. తస్థౌ - క్రియ - లిట్ - ప్ర.ఏ.

**సంధులు :-**

1. ఇచ్ఛావిభూత్యోః + అనురూపమ్ - ఇచ్ఛావిభూత్యోరనురూపమ్ - విసర్గసన్ధిః
2. వృష + అఙ్క - వృషాఙ్క - సవర్ణదీర్ఘసన్ధిః
3. అఙ్క + ఆగమన - అఙ్కాగమన - సవర్ణదీర్ఘసన్ధిః

**సమాసాలు / విగ్రహవాక్యాలు :-**

1. ఇచ్ఛావిభూత్యోః - ఇచ్ఛా చ విభూతిశ్చ ఇచ్ఛావిభూతీ, తయోః ఇచ్ఛావిభూత్యోః
2. అనురూపమ్ - రూపస్య యోగ్యమ్ అనురూపమ్। ష.త.। అవ్యయీభావః
3. సుహృదాస్థితాయామ్ - శోభనం హృదయం యేషాం తే సుహృదః, తైః ఆస్థితా సుహృదాస్థితా, తస్యాం సుహృదాస్థితాయామ్। తృ.త.
4. వృషాఙ్కాగమనప్రతీక్షః - వృషః అఙ్కః యస్య స వృషాఙ్కః, తస్య ఆగమనం వృషాఙ్కాగమనం, తత్ ప్రతీక్షతే ఇతి వృషాఙ్కాగమనప్రతీక్షః। 'కర్మణి' ఇత్యణ్।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. వృషాఙ్కః -**

ఎ) వృషో౭ఙ్కో ధ్వజచిహ్నం యస్య। శివః।

శ్లో॥ ఈశానః శశిశేఖరః పశుపతిః శూలీ శివః శఙ్కరః॥ ...
భూతేశః పరమేశ్వరో౭న్ధకరిపుర్దక్షాధ్వరధ్వంసకృత్॥

బి) శ్లో॥ స్థాణుః స్రష్టా ధూర్జటిర్వామదేవః
కామధ్వంసీ వ్యోమకేశః కపాలీ।
నీలగ్రీవో వహ్నిరేతాః పినాకీ
భీమో భర్గః కృత్తివాసా **వృషాఙ్కః**॥ 12

శ్లో॥ అహిర్బుధ్నో విరూపాక్షః శిపివిష్టో గణాధిపః।
గఙ్గాధరో మహాదేవో మృడః స్యాన్నీలలోహితః॥ 13

- అని హలాయుధకోశము '45' నామములను పేర్కొన్నది.



సి) శ్లో॥ పీతే గరే **వృషాఙ్కేణ** ప్రీతాస్తే౭మరదానవాః।
మమన్థుస్తరసా సిన్ధుం హవిర్ధానీ తతో౭భవత్॥
- శ్రీమద్భాగవతే 8-8-1

"వృషభారూఢుడగు శివుడు విషపానము చేసినంతట దేవదానవులిరువురు మిక్కిలి ప్రీతిచెందినవారై నూతనోత్సాహముతో సముద్రమంథనమునారంభించిరి..."

డి) శ్లో॥ **ఉమావృషాఙ్కౌ** శరజన్మనా యథా
యథా జయన్తేన శచీపురందరౌ।
తథా నృపస్సా చ సుతేన మాగధీ
ననన్దతుస్తత్సదృశేన తత్సమౌ॥ - ర.వం. 3-23

"పార్వతీపరమేశ్వరులును, శచీదేవేంద్రులును క్రమముగా వారల పుత్త్రులైన కుమారస్వామిజయంతులతో నెట్లు సంతోషించిరో యాలాగు వారలకు సమానులయిన సుదక్షిణాదిలీపులును ఆ దేవపుత్రులకు సమానుడయిన తమ బిడ్డతో ముచ్చటలాడుచుండిరి".

**క్రియాదర్శము :- తస్థౌ** - ష్ఠా (స్థా) గతినివృత్తౌ - నిలుచుట. అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాదయః(1), లిట్ - ప్ర.ఏకవచనాంతః।

**తస్థౌ** - తస్థతుః - తస్థుః

---

**అవతారిక :-** ఏతస్మిన్నన్తరే కైలాసే హరస్యాపి పురతః మాతృభిః తస్య పాణిగ్రహణాను రూపం ప్రసాధనం న్యస్తమ్-

**శ్లో॥ తావద్భవస్యాపి కుబేరశైలే**
**తత్పూర్వపాణిగ్రహణానురూపమ్।**
**ప్రసాధనం మాతృభిరాదృతాభిః**
**న్యస్తం పురస్తాత్పురశాసనస్య॥ 30**

**పదవిభాగము :-** తావత్, భవస్య, అపి, కుబేరశైలే, తత్పూర్వపాణిగ్రహణాను రూపమ్, ప్రసాధనమ్, మాతృభిః, ఆదృతాభిః, న్యస్తమ్, పురస్తాత్, పురశాసనస్య।

**అన్వయక్రమము :-** తావత్ కుబేరశైలే తత్పూర్వపాణిగ్రహణానురూపం ప్రసాధనమ్ అపి ఆదృతాభిః మాతృభిః పురశాసనస్య భవస్య పురస్తాత్ న్యస్తమ్।

**ప్రతిపదార్థము :–** తావత్ – అంతలో (ఇట పెండ్లికూతురగు పార్వతీదేవికి తగిన ఆహార్యమును చేయునంతలో) తత్పూర్వపాణిగ్రహణానురూపమ్ – మొట్టమొదటి దగు వివాహమునకు తగినదగు, ప్రసాధనమ్ అపి – మకరికాపత్త్రాద్యలంకార సమ్మేళనము, ఆదృతాభిః – ఆదరయుక్తముగా, మాతృభిః – బ్రాహ్మీమొదలగు సప్తమాతృకలచే, పురశాసనస్య – పురశాసనుడగు, భవస్య – శివునకు, పురస్తాత్ – ముందఱ, న్యస్తమ్ – ఉంచబడినది.

**పాఠాన్తరాలు :–**

1. తావద్భవస్యాపి – తావద్వరస్యాపి – తావత్‌హరస్యాపి.

**విభక్తులు / క్రియలు :–** 1. తావత్, అపి, పురస్తాత్ – అవ్యయాలు 2. కుబేరశైలే – ...**శైలే**, ...శైలయోః, ...శైలేషు; అకారాన్తః పుంలింగః కుబేరశైలశబ్దః, స.ఏ. 3. ...అనురూపమ్ – ...**అనురూపమ్**, ...అనురూపే, ...అనురూపాణి; అకారాన్త నపుంసకలింగ...అనురూపశబ్దః, ప్ర.ఏ. 4. ప్రసాధనమ్ – **ప్రసాధనమ్**, ప్రసాధనే, ప్రసాధనాని; అకారాన్త నపుంసకలింగః ప్రసాధనశబ్దః, ప్ర.ఏ. 5. ఆదృతాభిః – ఆదృతయా, ఆదృతాభ్యామ్, **ఆదృతాభిః**; ఆకారాన్తః స్త్రీలింగ ఆదృతాశబ్దః, తృ.బ. 6. మాతృభిః – మాత్రా, మాతృభ్యామ్, **మాతృభిః**; ఋకారాన్తః స్త్రీలింగో మాతృశబ్దః తృ.బ. 7. పురశాసనస్య – **పురశాసనస్య**, పురశాసనయోః, పురశాసనానామ్; అకారాన్తః పుంలింగః పురశాసనశబ్దః, ష.ఏ. 8. భవస్య – **భవస్య**, భవయోః, భవానామ్; అకారాన్తః పుంలింగః భవశబ్దః ష.ఏ.9. న్యస్తమ్ – ని + అస్ + క్త – అకారాన్తనపుంసకలింగః। ప్ర.ఏ. **న్యస్తమ్** – న్యస్తే – న్యస్తాని.

**సంధులు :–**

1. భవస్య + అపి – భవస్యాపి – సవర్ణదీర్ఘసన్ధిః।
2. గ్రహణ + అనురూపమ్ – గ్రహణానురూపమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।
3. మాతృభిః + ఆదృతాభిః – మాతృభిరాదృతాభిః – విసర్గసన్ధిః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. కుబేరశైలే – కుబేరస్య శైలః – కుబేరశైలః, తస్మిన్ కుబేరశైలే – ష.త.।
2. తత్పూర్వపాణిగ్రహణానురూపమ్ – పాణేః గ్రహణం పాణిగ్రహణమ్, తదేవపూర్వం తత్పూర్వం తచ్చ తత్ పాణిగ్రహణం తత్పూర్వపాణిగ్రహణం, రూపస్య యోగ్యమ్ అనురూపమ్, తత్పూర్వపాణిగ్రహణస్య అనురూపమ్, తత్పూర్వపాణిగ్రహణానురూపమ్। ష.త.
3. పురశాసనస్య – పురం శాసతీతి పురశాసనః తస్య పురశాసనస్య, 'కృత్యల్యుటో బహులమ్' ఇతి బాహులకాత్ కర్తరి ల్యుట్।





**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. మాతా :–** (ఋ. స్త్రీ.)

ఎ) మాన్యతే పూజ్యతే యా సా। మాన్ పూజాయామ్, 'నప్తృనేష్టృత్వష్టృహోతృపోతృభ్రాతృజామాతృపితృదుహితృ' – ఇతి తృచ్ నిపాత్యతే। స్వస్రాదిత్వాట్టాప్ న। సప్తదేవతామాతరః

బి) 'బ్రాహ్మీ చ వైష్ణవీ చైన్ద్రీ రౌద్రీ వారాహికీ తథా।
కౌబేరీ చైవ కౌమారీ మాతరః సప్తకీర్తితాః।
– ఇతి అమరటీకాయాం భరతః।

సి) మాతా –(స్త్రీ.)

1) మాన్యతే పూజ్యతే ఇతి। మాన్ పూజాయామ్ + తన్ తతష్టాపి నిపాతనాత్ సాధుః। జననీ;

'విశ్వేశ్వరీం విశ్వమాతాం చణ్డికాం ప్రణమామ్యహమ్'
– ఇతి 'శివరహస్యే' దుర్గాస్తవదర్శనాద్ ఆబన్తోఽ_యం శబ్దః।

డి) "అంబా సవిత్రీ జననీ చ **మాతా**".

ఇ) హస్తస్పర్శో హి మాతౄణామజలస్య జలాఞ్జలిః। –ప్రతిమానాటకే 3–13

యఫ్) శ్లో॥ గురుపత్నీ రాజపత్నీ జ్యేష్ఠపత్నీ తథైవ చ,
పత్నీమాతా స్వమాతా చ పఞ్చైతా మాతరః స్మృతాః॥
– నరాభరణే 2–8

యఫ్) సహస్రం హి పితుర్మాతా గౌరవేణాతిరిచ్యతే। –బాలరామాయణే 4–30

జి) శ్లో॥ నాస్తి మాతృసమా ఛాయా నాస్తి మాతృసమా గతిః।
నాస్తి మాతృసమం త్రాణం నాస్తి మాతృసమా ప్రపా॥
– స్కన్దపురాణే మా.కౌ. 6–103

హెచ్) శ్లో॥ **మాతా** గురుతరా భూమేః ఖాత్ పితోచ్చతరస్తథా।
మనః శీఘ్రతరం వాతాచ్చిన్తా బహుతరీ తృణాత్॥
– మహాభారతే, వనపర్వే – 313.60

ఐ) మాతరం పితరం చైవ యస్తు కుర్యాత్ ప్రదక్షిణమ్।
ప్రదక్షణీకృతా తేన సప్తద్వీపా వసుంధరా॥ – పద్మపురాణే 5–46–12

జె) హన్త! మాతరి భవన్తి సుతానాం మన్తవః కిల సుతేషు న మాతుః ।
-చైతన్యచంద్రోదయే 1-61

కె) **మాతా** భూమిః పుత్రో అహం పృథివ్యాః। - అథర్వవేదే 12-1-1

యల్) జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ।

**2. తావత్ - అవ్యయకోశః (386)**

తుల్యయోగితా సాకల్య మాన క్రమావధ్యవధారణాదయోస్యార్థాః। "తావత్ తత్పరిమాణే త్రిః, అవ్యయం త్వవధారణే। సమ్భ్రమే చ పరిచ్ఛేదే తథా కార్త్స్న్యాధికారయోః' ఇతి వాఙ్మయార్ణవః। యావత్తావచ్ఛబ్దౌ శబ్దశక్తిస్వాభావ్యాత్ పరస్పరసాపేక్షవేవ స్వస్వార్థమవగమయతః। క్వచిత్ కేవలావపి।

**తుల్యయోగితాయామ్** - యావత్కార్యం తావత్ కురు।

**సాకల్యే** - యావద్దత్తమ్ తావద్ భుక్తమ్

**మానే** - ఆస్తాం తావత్।

**క్రమే** - 'త్వమేవ తావత్ పరిచిన్తయ స్వయమ్' - కు.సం. 5-67

**అవధౌ** - తావదధీష్వ యావద్ బుధ్యసే

**అవధారణే** - 'నిరాసకస్యాపి న తావదుత్సహే'।

---

**అవతారిక :-** మాతృషు గౌరవాత్ తత్ ప్రసాధనం కేవలమీశ్వరేణ స్పృష్టం, స్వస్య స్వాభావికో వేష ఏవ భావాన్తరం ప్రాప-

**శ్లో॥ తద్గౌరవాన్మఙ్గలమణ్డనశ్రీః**
**సా పస్పృశే కేవలమీశ్వరేణ।**
**స ఏవ వేషః పరిణేతురిష్టం**
**భావాన్తరం తస్య విభోః ప్రపేదే॥ 31**

**పదవిభాగము :-** తద్గౌరవాత్, మఙ్గలమణ్డనశ్రీః, సా, పస్పృశే, కేవలమ్, ఈశ్వరేణ, సః, ఏవ, వేషః, పరిణేతుః, ఇష్టమ్, భావాన్తరమ్, తస్య, విభోః, ప్రపేదే।

**అన్వయక్రమము :-** ఈశ్వరేణ సా మఙ్గలమణ్డనశ్రీః తద్గౌరవాత్ కేవలం పస్పృశే। (కిన్తు) తస్య విభోః స ఏవ వేషః పరిణేతుః ఇష్టం భావాన్తరం ప్రపేదే।



**ప్రతిపదార్థము :-** ఈశ్వరేణ - శివునిచేత, సా - ఇంతకుముందు చెప్పిన, మఙ్గలమణ్డనశ్రీః - మకరికాపత్రాద్యలంకారశోభాసమ్మేళనము, తద్గౌరవాత్ - ఆ బ్రాహ్మిమొదలగు సప్తమాతృకలమీది గౌరవమువలన, కేవలమ్ - కేవలము, పస్పృశే - తాకబడెను. తస్య - ఆ, విభోః - శివునకు, స ఏవ వేషః - పూర్వకాలికమైన నేపథ్యమే, పరిణేతుః - వరునకు తగిన అనగా వివాహోద్యుక్తమైన దానికి, ఇష్టమ్ - కోరదగినదగు, భావాన్తరమ్ - మఱొక రూపమును, ప్రపేదే - పొందెను.

**తాత్పర్యము :-** శివునిచేత ఇంతకుముందు చెప్పిన మకరికాపత్రాద్యలంకారశోభా సమ్మేళనము ఆ బ్రాహ్మి మొదలగు సప్తమాతృకలమీది గౌరవమువలన కేవలము తాకబడెను. ఆ శివునకు పూర్వకాలికమైన నేపథ్యమే వరునకు తగిన అనగా వివాహోద్యుక్తమైనదానికి కోరదగినదగు మఱొక రూపమును పొందెను.

**పాఠాన్తరాలు :-** 1. స ఏవ వేష (శః) - స్వ ఏవ వేషః। స్వభావవేశః।

**విభక్తులు / క్రియలు :-** 1. ఈశ్వరేణ - **ఈశ్వరేణ**, ఈశ్వరాభ్యామ్, ఈశ్వరైః; అకారాన్తః పుంలింగః, ఈశ్వరశబ్దః, తృ.ఏ. 2. సా - **సా**, తే, తాః; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః, ప్ర.ఏ. 3. మఙ్గలమణ్డనశ్రీః - **...శ్రీః**, ...శ్రియౌ, ...శ్రియః; ఈకారాన్తః స్త్రీలింగో మఙ్గల...శ్రీశబ్దః, ప్ర.ఏ. 4. తద్గౌరవాత్ - **తద్గౌరవాత్**, తద్గౌరవాభ్యామ్, తద్గౌరవేభ్యః; అకారాన్త నపుంసకలింగ స్తద్గౌరవశబ్దః, ప్ర.ఏ. 5, కేవలమ్ - అవ్యయము 6. పస్పృశే - క్రియ - లిట్ - ప్ర.ఏ. కర్మణిప్రయోగము, స్పృశ్ ధాతుజన్యము. 7. తస్య - **తస్య**, తయోః, తేషామ్; దకారాన్తః పుంలింగ స్తచ్ఛబ్దః, ష.ఏ. 8. విభోః - **విభోః**, విభ్వోః, విభూనామ్; ఉకారాన్తః పుంలింగో విభుశబ్దః, ప్ర.ఏ. 9. వేషః - **వేషః**, వేషౌ, వేషాః; అకారాన్తః పుంలింగో వేషశబ్దః, ప్ర.ఏ. 10. పరిణేతుః - **పరిణేతుః**, పరిణేత్రోః, పరిణేతౄణామ్; ఋకారాన్తః పుంలింగః పరిణేతృశబ్దః, ష.ఏ. 11. ఇష్టమ్ - **ఇష్టమ్**, ఇష్టే, ఇష్టాని; అకారాన్త నపుంసకలింగ ఇష్టశబ్దః, ద్వి.ఏ. 12. భావాన్తరమ్ - **భావాన్తరమ్**, భావాన్తరే, భావాన్తరాణి; అకారాన్త నపుంసకలింగో భావాన్తరశబ్దః, ద్వి.ఏ. 13. ప్రపేదే - క్రియ.

**సంధులు :-**

1. తదౌర్గవాత్ + మఙ్గల... - తద్గౌరవాన్మఙ్గల...- అనునాసికసన్ధిః।
2. పరిణేతుః + ఇష్టమ్ - పరిణేతురిష్టమ్ - విసర్గసన్ధిః।
3. భావ + అన్తరమ్ - భావాన్తరమ్ - సవర్ణదీర్ఘసన్ధిః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :-**

1. మఙ్గలమణ్డనశ్రీః - మంగలార్థం మణ్డనం మఙ్గలమణ్డనం, తస్య శ్రీః మఙ్గలమణ్డనశ్రీః - ష.త.

2. తద్గౌరవాత్ – గురోః భావః గౌరవమ్, తాసు గౌరవం తద్గౌరవం, తస్మాత్ తద్గౌరవాత్। స.త.

3. పరిణేతుః – పరిణయతీతి పరిణేతా, తస్య పరిణేతుః, తృచ్‌ప్రత్యయః।

4. భావాన్తరమ్ – అన్యః భావః భావాన్తరమ్, తత్ – మయూరవ్యంసకాదిసమాసః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. పరిణేతా :–**

ఎ) పరిణయతీతి పరిణేతా, తృచ్ ప్రత్యయః।

బి) ఋకారాన్తః పుంలింగః పరిణేతృశబ్దః।

సి) శ్లో॥ స్థిత్యై దణ్డయతో దణ్డ్యాన్**పరిణేతుః** ప్రసూతయే।
అప్యర్థకామౌ తస్యాస్తాం ధర్మాయైవ మనీషిణః। – ర.వం. 1–25

2. శ్లో॥ సతీమపి జ్ఞాతికులైకసంశ్రయాం
జనోఽన్యథా భర్తృమతీం విశఙ్కతే।
అతస్సమీపే **పరిణేతు** రిష్యతే
ప్రియాప్రియా వా ప్రమదా స్వబన్ధుభిః।
– ఇతి అభిజ్ఞానశాకున్తలే 5–17

**క్రియాదర్శము :– 1. పస్పృశే :–** (కర్మణి) – స్పృశ్ – సంస్పర్శని – సకర్మకమ్। అనిట్। (పరస్మైపదీ) లిట్ – ప్ర. ఏకవచనాంతః। తుదాదయః (6)। ఆత్మనేపదీ

**పస్పృశే** – పస్పృశాతే – పస్పృశిరే

2. **ప్రపేదే** – ప్రపూర్వకాత్ 'పదగతౌ' ఇత్యస్మాద్ధాతో స్సకర్మకాత్ కర్తరి భూతేలిట్, ఆత్మనేపదే, ప్ర.ఏ.

**ప్రపేదే** – ప్రపేదాతే – ప్రపేదిరే.

శ్లో॥ స విద్ధమాత్రః కిల నాగరూపముత్సృజ్య తద్విస్మితసైన్యదృష్టః।
స్ఫురత్ప్రభామణ్డలమధ్యవర్తి కాంతం వపుర్వ్యోమచరం **ప్రపేదే**॥
– ర.వం. 5–51

"...సేనాజనులు ఆశ్చర్యపడి చూచుచుండగా తేజఃపుంజము గల యాకాశమునందు సంచరించుమనోహరమైన దివ్యరూపమును ఆ యేనుగు **పొందెను.**





**అవతారిక:–** ఇతఃపరం చతుర్భిః భస్మప్రభృతీనాం భావాన్తరప్రాప్తిః వర్ణ్యతే –

**శ్లో॥ బభూవ భస్మైవ సితాఙ్గరాగః**
**కపాలమేవామలశేఖరశ్రీః।**
**ఉపాన్తభాగేషు చ రోచనాఙ్కో**
**గజాజినస్యైవ దుకూలభావః॥ 32**

**పదవిభాగము:–** బభూవ, భస్మ, ఏవ, సితాఙ్గరాగః, కపాలమ్, ఏవ, అమలశేఖరశ్రీః ఉపాన్తభాగేషు, చ, రోచనాఙ్కః, గజాజినస్య, ఏవ, దుకూలభావః।

**అన్వయక్రమము:–** భస్మ ఏవ సితాఙ్గరాగః బభూవ। కపాలమేవ అమల శేఖరశ్రీః బభూవ। గజాజినస్య ఏవ ఉపాన్తభాగేషు రోచనాఙ్కః దుకూలభావః చ బభూవ।

**ప్రతిపదార్థము:–** భస్మ ఏవ – విభూతియే, సితాఙ్గరాగః – సుగంధలేపనము, బభూవ – ఆయెను, కపాలమేవ – కపాలమే, అమలశేఖరశ్రీః – పవిత్రమైన శిరోభూషణము, బభూవ – ఆయెను, గజాజినస్య ఏవ – గజచర్మమే, ఉపాన్తభాగేషు – అంచులందు, రోచనాఙ్కః – గోరోచనమువలె పచ్చనైన వర్ణము గలదియగు, దుకూలభావః చ – పట్టుపంచెగా, బభూవ – ఆయెను.

**తాత్పర్యము:–** విభూతియే సుగంధలేపనమాయెను. కపాలమే పవిత్రమైన శిరోభూషణమాయెను. గజచర్మమే అంచులందు గోరోచనమువలె పచ్చనైన వర్ణము గలది యగు పట్టుపంచెగా ఆయెను.

**పాఠన్తరాలు:–** 1. సితాఙ్గ.. – కృతాఙ్గ... 2. దుకూల – దుగూల

**విభక్తులు / క్రియలు :–** 1. భస్మ–**భస్మ**, భస్మనీ, భస్మాని; నకారాన్తనపుంసకలింగో భస్మన్శబ్దః, ప్ర.ఏ. 2. సితాఙ్గరాగః – **రాగః**...రాగౌ...రాగాః, అకారాన్తఃపుంలింగో సితాఙ్గరాగశబ్దః ప్ర.ఏ. 3. బభూవ – క్రియ – లిట్. ప్ర.ఏకవచనాంతః। 4. కపాలమ్ – **కపాలమ్** – కపాలే – కపాలాని; అకారాన్తనపుంసకలింగః కపాలశబ్దః, ప్ర.ఏ.5. అమలశేఖరశ్రీః – **...శ్రీః**..శ్రియౌ...శ్రియః, ఈకారాన్తః స్త్రీలింగ అమలశేఖరశ్రీశబ్దః, ప్ర.ఏ.6. గజాజినస్య – **గజాజినస్య** – గజాజినయోః – గజాజినానామ్, అకారాన్త నపుంసకలింగో గజాజినశబ్దః, ష.ఏ. 7. ఉపాన్తభాగేషు –**...భాగే** –...భాగయోః– ...భాగేషు; అకారాన్త నపుంసకలింగో ఉపాన్తభాగశబ్దః, ష.ఏ. 8. రోచనాఙ్కః – **రోచనాఙ్కః** – రోచనాఙ్కౌ – రోచనాఙ్కాః, అకారాన్తః పుంలింగః రోచనాఙ్కశబ్దః, ప్ర.ఏ. 9. ఏవ, చ – అవ్యయాలు.

**సంధులు:–**

1. భస్మ + ఏవ – భస్మైవ, వృద్ధిసన్ధిః – వృద్ధిరేచి (సూ 6–1–85)

2. సిత + అఙ్గరాగః – సితాఙ్గరాగః – సవర్ణదీర్ఘసన్ధిః।
3. ఏవ + అమలశేఖరశ్రీః – ఏవామలశేఖరశ్రీః – సవర్ణదీర్ఘసన్ధిః।
4. రోచనాఙ్కః + గజాజినస్య – రోచనాఙ్కో గజాజినస్య – ఉత్వాదేశః।
5. గజాజినస్య + ఏవ – గజాజినస్యైవ – వృద్ధిసన్ధిః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు:–**

1. సితాఙ్గరాగః – అఙ్గస్య రాగః అంగరాగః, సితశ్చాసౌ, అఙ్గరాగః, సితాఙ్గరాగః కర్మధారయసమాసః।
2. అమలశేఖరశ్రీః – అవిద్యమానం మలం యస్య తద్ అమలం తత్ చ తత్ శేఖరమ్ అమలశేఖరం తస్య శ్రీః అమలశేఖరశ్రీః, ష.త.।
3. గజాజినస్య – గజస్య అజినం గజాజినం, తస్య ష.త.।
4. ఉపాన్తభాగేషు – ఉపాన్తాశ్చ తే భాగాః ఉపాన్తభాగాః, తేషు ఉపాన్తభాగేషు। కర్మధారయః।
5. రోచనాఙ్కః – రోచనా ఏవ అఙ్కః యస్య సః రోచనాఙ్కః, బహువ్రీహిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు**

**1. కపాలః / కపాలమ్:–** ఎ) కం శిరో జలం వా పాలయతి।

బి) కం మస్తకం పాలయతీతి, క + పాలి + అణ్। యద్వా కమ్పతే యః, కపి చలనే + 'తమివిశివిడిగృణికులికపిపలిపఞ్చిభ్యః కాలన్' ఇతి కాలన్, కపినిర్దేశాద్ నలోపః।

సి) శ్లో॥ ద్వౌ శఙ్ఖకౌ **కపాలాని** చత్వారి శిరసస్తథా। – ఇతి యాజ్ఞవల్క్యః 3–90

డి) శ్లో॥ చూడాపీడ**కపాల**సంకులగలన్మాన్దాకినీవారయో
విద్యుత్ప్రాయలలాటలోచనపుటజ్యోతిర్విమిశ్రిత్విషః।
పాన్తు త్వామకఠోరకేతకశిఖాసందిగ్ధముగ్ధేన్దవో
భూతేశస్య భుజఙ్గవల్లివలయస్రఙ్నద్ధజూటా జటాః॥
– ఇతి మాలతీమాధవే ప్రథమోఽఙ్కే –2

సి) "రుద్రో యేన **కపాల**పాణిపుటకే భిక్షాటనం కారితః"
– భర్తృహరిత్రిశతి 2–95





**అలంకారాలు:–** అత్ర పరిణామాలంకారః। తల్లక్షణం యథా రుయ్యక అలంకార సర్వస్వే (16)

"ఆరోప్యమాణస్య ప్రకృతోపయోగిత్వే పరిణామః"
ఆరోప్యమాణము ప్రకృతోపయోగియైనచో పరిణామము.
ఇట 'విభూతియే – సుగంధలేపనము'గా
కపాలమే – పవిత్రమైనశిరోభూషణము'గా
గజచర్మమే – అంచులందు గోరోచనమువలె పచ్చనైన పట్టుపంచెగా రూపొందుటచే – నిది పరిణామాలంకారము.

**క్రియాదర్శము:– బభూవ –** 7వ శ్లోకవ్యాఖ్యాన భాగమును చూడగలరు.

---

**అవతారిక :–** తృతీయం లలాటస్థితం లోచనమేవ తిలకమభూత్–

**శ్లో॥ శఙ్ఖాన్తరద్యోతి విలోచనం య–**
**దన్తర్నివిష్టామలపిఙ్గతారమ్।**
**సాన్నిధ్యపక్షే హరితాలమయ్యాః**
**తదేవ జాతం తిలకక్రియాయాః॥** **33**

**పదవిభాగము :–** శఙ్ఖాన్తరద్యోతి, విలోచనమ్, యత్, అన్తర్నివిష్టామలపిఙ్గతారమ్, సాన్నిధ్యపక్షే, హరితాలమయ్యాః, తత్, ఏవ, జాతమ్, తిలకక్రియాయాః।

**అన్వయక్రమము :–** శఙ్ఖాన్తరద్యోతి అన్తర్ని...తారమ్, యద్విలోచనం తదేవ హరితాలమయ్యాః, తిలకక్రియాయాః సాన్నిధ్యపక్షే జాతమ్।

**ప్రతిపదార్థము :–** శఙ్ఖాన్తరద్యోతి – లలాటమధ్యమమున ప్రకాశించుచున్నది, అన్తర్నివిష్టామలపిఙ్గతారమ్ యద్విలోచనమ్ – పసుపుపచ్చని కనుపాపగలదియగు ఏ అగ్నినేత్రమో, తదేవ – ఆ మూడవకన్నే, హరితాలమయ్యాః తిలకక్రియాయాః – హరితాలవర్ణద్రవ్యవిశేషమగు కల్యాణతిలకముగా, సాన్నిధ్యపక్షే – లలాట మధ్యమమున, జాతమ్ – జనించినది.

**తాత్పర్యము :–** లలాటమధ్యమమున ప్రకాశించుచున్నది, పసుపు పచ్చని కనుపాప గలదియు అగు ఏ అగ్నినేత్రమో ఆ కన్నే హరితాలవర్ణద్రవ్యవిశేషమగు కల్యాణ తిలకముగా లలాటమధ్యమమున జనించినది.

**పాఠాన్తరాలు :-** 1. అన్తర్నివిష్టామల... - అన్తర్నివిష్టానల

**విభక్తులు / క్రియలు :-** 1. శఙ్ఖాన్తరద్యోతి - **...ద్యోతి**, ...ద్యోతినీ, ...ద్యోతీని; నకారాన్త నపుంసకలింగ ద్యోతిన్శబ్దః ప్ర.ఏ. 2. అన్తర్నివిష్టామలపిఙ్గతారమ్ - **...తారమ్**, ...తారే, ...తారాణి; అకారాన్త నపుంసకలింగ...తారశబ్దః, ప్ర.ఏ. 3. యత్ - **యత్**, యే, యాని; దకారాన్త నపుంసకలింగ యచ్ఛబ్దః, ప్ర.ఏ. 4. తత్ - **తత్**, తే, తాని; దకారాన్త నపుంసకలింగ తచ్ఛబ్దః, ప్ర.ఏ. 5. విలోచనమ్ - **విలోచనమ్**, విలోచనే, విలోచనాని; అకారాన్త నపుంసకలింగో విలోచనశబ్దః, ప్ర.ఏ. 6. ఏవ - అవ్యయము 7. హరితాలమయ్యాః - **హరితాలమయ్యాః**, హరితాలమయ్యోః, హరితాలమయీనామ్; ఈకారాన్తః స్త్రీలింగో హరితాలమయీశబ్దః, ష.ఏ. 8. తిలకక్రియాయాః - **తిలకక్రియాయాః**, తిలకక్రియయోః, తిలకక్రియాణామ్; ఆకారాన్తః స్త్రీలింగ స్తిలకక్రియాశబ్దః, ష.ఏ. 9. సాన్నిధ్యపక్షే - **...పక్షే**, ...పక్షయోః, ...పక్షేషు; అకారాన్తః పుంలింగ స్సాన్నిధ్యపక్షశబ్దః, స.ఏ. 10. జాతమ్ - **జాతమ్**, జాతే, జాతాని; అకారాన్త నపుంసకలింగో జాతశబ్దః, ప్ర.ఏ.

**సంధులు :-**

1. తత్ + ఏవ - తదేవ - జశ్త్వసన్ధిః
2. శఙ్ఖ + అన్తర్ - శఙ్ఖాన్తర్ - సవర్ణదీర్ఘసన్ధిః
3. నివిష్ట + అమల - నివిష్టామల - సవర్ణదీర్ఘసన్ధిః
4. యత్ + అన్తర్... - యదన్తర్... - జశ్త్వసన్ధిః

   **ఝలాం జశోఽన్తే** (సూ 8-2-39) అనునాసికాంతస్థవర్ణములు తప్ప మిగిలిన పదాంతగతహల్లులకు (ఝల్లులకు) సవర్ణమైన వర్గతృతీయ వర్ణము (జశ్త్వము) ఆదేశముగ వచ్చును. (జశ్ - జబగడద)

**సమాసాలు / విగ్రహవాక్యాలు :-**

1. శఙ్ఖాన్తరద్యోతి - శఙ్ఖయోః అన్తరం శఙ్ఖాన్తరం, శఙ్ఖాన్తరే ద్యోతతే తచ్ఛీలం శఙ్ఖాన్తరద్యోతి, ణిని ప్రత్యయః
2. అన్తర్నివిష్టామలపిఙ్గతారమ్ - అవిద్యమానం మలం యస్యాః సా అమలా, అన్తర్నివిష్టా అమలా పిఙ్గా తారా యస్య తద్ అన్తర్నివిష్టామలపిఙ్గతారమ్। బహువ్రీహిః
3. విలోచనమ్ - విశిష్టం లోచనం విలోచనమ్। గతిసమాసః
4. హరితాలమయ్యాః - ప్రచురం హరితాలమ్ అస్తి అస్యాం సా హరితాలమయీ, తస్యాః హరితాలమయ్యాః
5. తిలకక్రియాయాః - తిలకస్య క్రియా తిలకక్రియా, తస్యాః తిలకక్రియాయాః ష.త.।
6. సాన్నిధ్యపక్షే - సన్నిధి ఏవ సాన్నిధ్యం, సాన్నిధ్యస్య పక్షః సాన్నిధ్యపక్షః తస్మిన్ సాన్నిధ్యపక్షే। ష.త.।



**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. లోచనమ్ :-**

ఏ) లోచతేఽ నేనేతి। లోచ్ + కరణ్ + ల్యుట్। చక్షుః

బి) 'దృగ్దృష్టినేత్ర**లోచన**చక్షుర్నయనామ్బకేక్షణాక్షీణి।' - అని హలాయుధకోశము '9' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ **"వక్త్రాన్తైః పద్మపత్రాభైర్లోచనైః సుఖభాగినః।**
**మార్జారలోచనైః పాపో మహాత్మా మధుపిఙ్గలైః।**
**క్రూరాః కేకరనేత్రాశ్చ హరిణాక్షాః సకల్మషాః।**
**జిహ్మైశ్చ లోచనైః క్రూరాః సేనాన్యోగజలోచనాః।**
**గమ్భీరాక్షా ఈశ్వరాః స్యుర్మన్త్రిణః స్థులచక్షుషః।**
**నీలోత్పలాక్షా విద్వాంసః సౌభాగ్యం శ్యావచక్షుషామ్।**
**స్యాత్ కృష్ణతారకాక్షాణామక్ష్ణాముత్పాటనం కిల।**
**మణ్డలాక్షాశ్చ పాపాః స్యుర్నిఃస్వాః స్యుర్దీర్ఘలోచనాః।**
**దృక్స్నిగ్ధా విపులా భోగే అల్పాయుర్నాభిరున్నతా।**
**విశాలోన్నతాః సుఖినో దరిద్రా విషమభ్రువః।"**

**- ఇతి గారుడే, 65 అధ్యాయః.**

**2. శఙ్ఖః :-**

ఏ) '**శఙ్ఖో**నిధౌ లలాటాస్థ్నీ'తి సింహః।

బి) '**శఙ్ఖ**స్తు లలాటాస్థిమర్మణోరి'తి కేశవః।

సి) శమేః ఖః - 1-102 ఇతి ఖః (ఉణాదిసూత్రమ్)

డి) శ్లో॥ **శఙ్ఖే** నేత్రే కరౌ పాదౌ గుల్ఫావూరూ సమౌ చితౌ।
అనువృత్తనఖాః స్నిగ్ధాః సమాశ్చాఙ్గులయో మమ॥

- శ్రీమద్రామాయణే 6-48-10

**అలంకారాలు :–** అత్రాపి పరిణామాలంకారః। తల్లక్షణం యథా సాహిత్యదర్పణే–
'విషయాత్మతయారోప్యే ప్రకృతార్థోపయోగిని।
పరిణామో భవేత్ తుల్యాతుల్యాధికరణో ద్విధా'॥ ఇతి

శివభగవానుని లలాటమధ్యమున ప్రకాశించు మూడవనేత్రము – వివాహమహోత్సవ భాగమునందు కల్యాణతిలకముగా రూపొందినదిగా వర్ణింపబడుటచే నిట పరిణామాలంకారమున్నదని చెప్పదగును.

---

**అవతారిక :–** తత్రత్ప్రదేశేషు భుజగేశ్వరాః ఆభరణాన్తరత్వం భేజుః।

**శ్లో॥ యథాప్రదేశం భుజగేశ్వరాణాం**
**కరిష్యతామాభరణాన్తరత్వమ్।**
**శరీరమాత్రం వికృతిం ప్రపేదే**
**తథైవ తస్థుః ఫణరత్నశోభాః॥ 34**

**పదవిభాగము :–** యథాప్రదేశమ్, భుజగేశ్వరాణామ్, కరిష్యతామ్, ఆభరణాన్తరత్వమ్, శరీరమాత్రమ్, వికృతిమ్, ప్రపేదే, తథా, ఏవ, తస్థుః, ఫణరత్నశోభాః।

**అన్వయక్రమము :–** యథాప్రదేశమ్, ఆభరణాన్తరత్వమ్, కరిష్యతాం భుజగేశ్వరాణాం శరీరమాత్రం వికృతిం ప్రపేదే। ఫణరత్నశోభాః తథైవ తస్థుః।

**ప్రతిపదార్థము :–** యథాప్రదేశమ్ – ఆయా భాగములందు, ఆభరణాన్తరత్వమ్ – ఆభరణములుగా, కరిష్యతామ్ – మారిపోవునవి అగు, భుజగేశ్వరాణామ్ – వాసుకి మొదలగు సర్పరాజులయొక్క, శరీరమాత్రమ్ – దేహములు మాత్రమే, వికృతిమ్ – వికారమును, ప్రపేదే – పొందెను. ఫణరత్నశోభాః – స్ఫుటామణికాంతులు, తథైవ – అవ్విధముగానే, తస్థుః– ఉన్నవి.

**తాత్పర్యము :–** ఆయా భాగములందు ఆభరణములుగా మారిపోవునవి అగు వాసుకి మొదలగు సర్పరాజులయొక్క దేహములు మాత్రమే వికారమును పొందెను. స్ఫుటామణికాంతులు అవ్విధముగనే ఉన్నవి.

**విభక్తులు / క్రియలు :–** 1. యథాప్రదేశమ్ – అవ్యయము 2. ఆభరణాన్తరత్వమ్ – **...అన్తరత్వమ్,** ...అన్తరత్వే, ...అన్తరత్వాని; అకారాన్త నపుంసకలింగ ఆభరణాన్తరత్వశబ్దః, ప్ర.ఏ. 3. కరిష్యతామ్ – కరిష్యతః, కరిష్యతోః, **కరిష్యతామ్**; తకారాన్తః పుంలింగః కరిష్యత్‌శబ్దః,ష.బ. 4. భుజగేశ్వరాణామ్ –





భుజగేశ్వరస్య, భుజగేశ్వరయోః, **భుజగేశ్వరాణామ్**; అకారాన్తః పుంలింగో భుజగేశ్వరశబ్దః, ష.ఏ. 5. శరీరమాత్రమ్ **– శరీరమాత్రమ్**, శరీరమాత్రే, శరరీమాత్రాణి; అకారాన్త నపుంసకలింగశ్శరీర మాత్రశబ్దః 6. వికృతిమ్ – **వికృతిమ్,** వికృతీ, వికృతీః; ఇకారాన్తః స్త్రీలిఙ్గః వికృతిశబ్దః, ద్వి.ఏ. 7. ప్రపేదే – క్రియ, 8. ఫణరత్నశోభాః – ...శోభా, ...శోభే, **...శోభాః;** ఆకారాన్తః స్త్రీలింగః ఫణరత్నశోభాశబ్దః, ప్ర.బ. 9. తథా, ఏవ – అవ్యయాలు 10. తస్థుః – క్రియ.

**సంధులు :–**

1. తథా + ఏవ – తథైవ – వృద్ధిసన్ధిః।
2. భుజగ + ఈశ్వరాణామ్ – భుజగేశ్వరాణామ్ – గుణసన్ధిః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. యథాప్రదేశమ్ – ప్రదేశాన్ అనతిక్రమ్య యథాప్రదేశమ్। అవ్యయీభావ సమాసః।
2. ఆభరణాన్తరత్వమ్ – అన్యాని ఆభరణాని ఆభరణాన్తరాణి, తేషాం భావః ఆభరణాన్తరత్వం తత్। తద్ధితవృత్తిః।
3. కరిష్యతామ్ – కరిష్యన్తీతి కరిష్యన్తః తేషాం కరిష్యతామ్, 'లృటః సద్వా' ఇతి శతృప్రత్యయః।
4. భుజగేశ్వరాణామ్ – భుజగానామ్ ఈశ్వరాః భుజగేశ్వరాః తేషాం భుజగేశ్వరాణామ్ – ష.త.
5. శరీరమాత్రమ్ – శరీరమ్ ఏవ మాత్రమ్। **'మయూరవ్యంసకాదయః చ'** ఇతి సమాసః
6. ఫణరత్నశోభాః – ఫణరత్నానాం శోభాః ఫణరత్నశోభాః। ష.త.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ఫణః :– (త్రి.) –**

ఎ) ఫణతి విస్తృతిం గచ్ఛతీతి। ఫణ్ + అచ్। సర్పస్య విస్తృతమస్తకమ్।

బి) 'ఫణః ఫణా ఫటా ప్రోక్తా...'
అని హలాయుధకోశము '3' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ పరివాదం బ్రువాణే హి దురాత్మా వై మహాజనే।
ప్రకాశయతి దోషాంస్తు సర్పః ఫణమివోచ్ఛ్రితమ్॥
– ఇతి మహాభారతే

డి) శ్లో॥ జ్వలతి చలితేన్ధనోఽగ్నిర్విప్రకృతః పన్నగః ఫణాం కురుతే।
ప్రాయః స్వం మహిమానం క్షోభాత్ప్రతిపద్యతే హి జన్తుః॥
– ఇతి అభిజ్ఞానశాకున్తలే – 6-31

"...పాము కదిలింపబడినదై పడగను చేయును..."

**క్రియాదర్శము :– 1.** ప్రపేదే – పూర్వము చెప్పబడినది.
**2.** తస్థుః – పూర్వము చెప్పబడినది.

---

**అవతారిక :–** చన్ద్రచూడామణేః నాన్యచూడామణిగ్రహణేన ప్రయోజనమ్ ఆసీత్।

**శ్లో॥ దివాపి నిష్ఠ్యూతమరీచిభాసా
బాల్యాదనావిష్కృతలాఞ్ఛనేన।
చన్ద్రేణ నిత్యం ప్రతిభిన్నమౌలేః
చూడామణేః కిం గ్రహణం హరస్య॥ 35**

**పదవిభాగము:–**దివా, అపి, నిష్ఠ్యూతమరీచిభాసా, బాల్యాత్, అనావిష్కృత లాఞ్ఛనేన, చన్ద్రేణ, నిత్యమ్, ప్రతిభిన్నమౌలేః, చూడామణేః, కిమ్, గ్రహణమ్, హరస్య।

**అన్వయము :–** దివా అపి నిష్ఠ్యూతమరీచిభాసా బాల్యాత్ అనావిష్కృతలాఞ్ఛనేన చన్ద్రేణ నిత్యం ప్రతిభిన్నమౌలేః హరస్య చూడామణేః గ్రహణం కిమ్।

**ప్రతిపదార్థము :–** దివా + అపి – పగటివేళ కూడా, నిష్ఠ్యూతమరీచిభాసా – ప్రసరింపజేయుచున్న కిరణములుగల, బాల్యాత్ – బాల్యావస్థవలన, అనావిష్కృత లాఞ్ఛనేన – తనయందు మచ్చను వెలువరింపని, చన్ద్రేణ – చంద్రుడే, నిత్యమ్ – ఎల్లప్పుడు, ప్రతిభిన్నమౌలేః – శిరోభూషణముగా గల, హరస్య – శివునకు, చూడామణేః – మఱియొక చూడామణియొక్క గ్రహణమ్ కిమ్ – స్వీకారమేమి?

**తాత్పర్యము :–** 'బాలచంద్రుడే చూడామణి అయినాడని' పిండితార్థము.

**పాఠాన్తరాలు :–** 1. ...భాసా – ...భాజా; 2. ...లాఞ్ఛనేన – ...లక్షణేన.

**విభక్తులు / క్రియలు :–** 1. దివా – అవ్యయము – దినార్థకమిదమ్। 2. అపి – అవ్యయము 3. నిష్ఠ్యూతమరీచిభాసా – **...భాసా,** ...భాభ్యామ్,... భాభిః; సకారాన్తః పుంలింగో ని...భాశ్శబ్దః, తృ.ఏ. 4. బాల్యాత్ – **బాల్యాత్**, బాల్యాభ్యామ్, బాల్యేభ్యః; అకారాన్త నపుంసకలింగో బాల్యశబ్దః,





తృ.ఏ. 5. అనావిష్కృతలాఞ్ఛనేన – **...లాఞ్ఛనేన,** ...లాఞ్ఛనాభ్యామ్, ...లాఞ్ఛనైః; అకారాన్తః పుంలింగ అనా...లాఞ్ఛనశబ్దః, తృ.ఏ. 6. చన్ద్రేణ – **చన్ద్రేణ**, చన్ద్రాభ్యామ్, చన్ద్రైః; అకారాన్తః పుంలింగో చన్ద్రశబ్దః, తృ.ఏ. 7. నిత్యమ్ – అవ్యయము 8. ప్రతిభిన్నమౌలేః – **...మౌలేః**, ...మౌల్యోః, ...మౌలీనామ్; ఇకారాన్తః పుంలింగః ప్రతిభిన్నమౌలిశబ్దః, ష.ఏ. 9. హరస్య – **హరస్య**, హరయోః, హరాణామ్; అకారాన్తః పుంలింగో హరశబ్దః, ష.ఏ. 10. చూడామణేః – **చూడామణేః**, చూడామణ్యోః, చూడామణీనామ్; ఇకారాన్తః పుంలింగః, చూడామణిశబ్దః, ష.ఏ. 11. గ్రహణమ్ – **గ్రహణమ్,** గ్రహణే, గ్రహణాని; అకారాన్త నపుంసకలింగో గ్రహణశబ్దః, ప్ర.ఏ. 12. కిమ్ – అవ్యయము

**సంధులు :–**

1. బాల్యాత్ + అనావిష్కృత... – బాల్యాదనావిష్కృత... – జశ్త్వమ్।
2. దివా + అపి – దివాపి – సవర్ణదీర్ఘసన్ధిః।

**సమాసాలు :–**

1. నిష్ఠ్యూతమరీచిభాసా – మరీచీనాం భాసః, మరీచిభాసః, నిష్ఠ్యూతాః మరీచిభాసః యస్య స నిష్ఠ్యూతమరీచిభాః, తేన నిష్ఠ్యూతమరీచిభాసా। బహువ్రీహిః।
2. అనావిష్కృతలాఞ్ఛనేన – న ఆవిష్కృతమ్ అనావిష్కృతం తద్ లాఞ్ఛనం యస్య సః అనావిష్కృతలాఞ్ఛనః, తేన। బహువ్రీహిః।
3. ప్రతిభిన్నమౌలేః – ప్రతిభిన్నః మౌలిః యస్య స ప్రతిభిన్నమౌలిః, తస్య। బహువ్రీహిః
4. చూడామణేః – చూడాయాః మణిః చూడామణిః, తస్య చూడామణేః, ష.త.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. మరీచి – (పుం.)**

ఎ) మ్రియన్తే నశ్యన్తి క్షుద్రజన్తవస్తమాంసి వానేన। మృ + ఈచి। కిరణః

బి) శ్లో॥ గర్భం దధత్యర్కమరీచయోఽస్మా–
ద్వివృద్ధిమత్రాశ్నువతే వసూని।
అబిన్ధనం వహ్నిమసౌ బిభర్తి
ప్రహ్లాదనం జ్యోతిరజన్యనేన। – ర.వం. 13 – 4

"సీతా! సూర్యకిరణములలో కొన్ని సముద్రమునుండి జలమయమైన గర్భమును ధరించివర్షమును కురియుచున్నవి."

**క్రియాదర్శము :- అభూత్** – ఇంతకుముందు చెప్పబడినది.

---

**అవతారిక :-** ఉమాశఙ్కరయోః పరస్పరం సాభిలాషదర్శనం వర్ణయతి –

**శ్లో॥ తయోః సమాపత్తిషు కాతరాణి**
**కిఞ్చిద్వ్యవస్థాపితసంహృతాని।**
**హ్రీయన్త్రణాం తత్క్షణమన్వభూవ-**
**న్నన్యోన్యలోలాని విలోచనాని॥ 75**

**పదవిభాగము :-** తయోః, సమాపత్తిషు, కాతరాణి, కిఞ్చిత్, వ్యవస్థాపితసంహృతాని, హ్రీయన్త్రణామ్, తత్క్షణమ్, అన్వభూవన్, అన్యోన్యలోలాని, విలోచనాని।

**అన్వయక్రమము :-** తయోః సమాపత్తిషు కాతరాణి కిఞ్చిత్ వ్యవ...తాని, అన్యోన్యలోలాని, విలోచనాని తత్క్షణం హ్రీయన్త్రణామ్ అన్వభూవన్।

**ప్రతిపదార్థము :-** తయోః – ఆ వధూవరులయొక్క, సమాపత్తిషు – అనుకొనకుండ కలియుటవలన, కాతరాణి – పిఱికితనమును పొందినవైనవి, కిఞ్చిత్ – ఇంచుకసేపు, వ్యవస్థాపితసంహృతాని – నిశ్చలములైన తరువాత వెనుకకు మరల్పబడినవైనవి, అన్యోన్యలోలాని – ఒకరినొకరు చూచుటయందు ఆసక్తిగలవి అగు, విలోచనాని – నేత్రములు, తత్క్షణమ్ – వెంటనే, హ్రీయన్త్రణామ్ – సిగ్గువలన సంకుచితములుగా, అన్వభూవన్ – అనుభూతమయినవి.

**తాత్పర్యము :-** ఆ వధువరులయొక్క 1. అనుకొనకుండ కలియుటవలన పిఱికితనమును పొందినవి, 2. ఇంచుకసేపు నిశ్చలములైన తరువాత వెనుకకు మరల్పబడినవి, 3. ఒకరినొకరు చూచుటయందు ఆసక్తికలవి అగు – నేత్రములు వెంటనే సిగ్గువలన సంకుచితములుగా అనుభూతములయినవి.

**పాఠాన్తరాలు :-** 1. హ్రియన్త్రణాం తత్క్షణమన్వభూవన్ – హ్రీయన్త్రణామానశిరే మనోజ్ఞామ్.

**విభక్తులు / క్రియలు :-** 1. తయోః – తస్యాః, **తయోః**, తాసామ్; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః, ష.ద్వి. 2. సమాపత్తిషు – సమాపత్తౌ, సమాపత్త్యోః, **సమాపత్తిషు**; ఇకారాన్తః స్త్రీలింగస్సమాపత్తిః, స.బ. 3. కాతరాణి – కాతరమ్, కాతరే, **కాతరాణి**; అకారాన్త నపుంసకలింగ కాతరశబ్దః, ప్ర.బ. 4. వ్యవస్థాపితసంహృతాని – ...సంహృతమ్, ...సంహృతే, **...సంహృతాని**; అకారాన్త నపుంసకలింగో





...సంహృతశబ్దః, 5. అన్యోన్యలోలాని – ...లోలమ్, ...లోలే, **...లోలాని**; అకారాన్త నపుంసకలింగ...లోలశబ్దః, ద్వి.బ. 6. విలోచనాని – విలోచనమ్, విలోచనే, **విలోచనాని;** అకారాన్త నపుంసకలింగో విలోచనశబ్దః, ద్వి.ఏ. 7. తత్క్షణమ్ – అవ్యయము, క్రియావిశేషణము. 8. హ్రీయన్త్రణామ్ – **హ్రీయన్త్రణామ్**, హ్రీయన్త్రణే, హ్రీయన్త్రణాః; ఆకారాన్తః స్త్రీలింగో హ్రీయన్త్రణాశబ్దః ద్వి.ఏ. 9. అన్వభూవన్ – క్రియ – భూతే లుఙ్ – ప్ర.ఏ.

**సంధులు :-**

1. అన్వభూవన్ + అన్యోన్యలోలాని – అన్వభూవన్నన్యోన్యలోలాని। జముడాగమసన్ధిః।
2. అను + అభూవన్ – అన్వభూవన్ – యణాదేశసన్ధిః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :-**

1. వ్యవస్థాపితసంహృతాని – పూర్వం వ్యవస్థాపితాని పశ్చాత్ సంహృతాని వ్యవస్థాపితసంహృతాని 'పూర్వకాలైకసర్వజరత్పురాణనవకేవలాః సమానాధికరణేన' ఇతి సమాసః।
2. అన్యోన్యలోలాని – అన్యోన్యస్మిన్ లోలాని అన్యోన్యలోలాని। స.త.
3. హ్రీయన్త్రణామ్ – హ్రియా యన్త్రణామ్, హ్రీయన్త్రణామ్। తృ.త.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

**1. హ్రీః** – ఎ) హ్రీ లజ్జాయామ్ + సమ్పదాదిత్వాత్ క్విప్। లజ్జా, వ్రీడా।

బి) '**హ్రీర్లజ్జా**పత్రపా వ్రీడా త్రపా మన్దాక్షముచ్యతే। 567
– అని హలాయుధకోశము '16' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ నాహం తాత! కరిష్యామి పృథివ్యాః పరిపాలనమ్।
నాపైతి **హ్రీర్మే** మనసో రాజ్యేऽన్యం త్వం నియోజయ॥
– ఇతి మార్కణ్డేయే 129 /22

డి) శ్లో॥ అలం **హ్రియా** మాం ప్రతి యన్ముహూర్తం
దయాపరోऽభూః ప్రహరన్నపి త్వమ్।
తస్మాదుపచ్ఛందయతి ప్రయోజ్యం
మయి త్వయా న ప్రతిషేధరౌక్ష్యమ్॥ – ర.వం. 5-58

2. Here is a beautiful description of the longing looks of the lovers at their first meeting made more charming by the restraint

caused by the bashfulness. This is the అనుభావ of శృంగారరసః – అని 'రామచంద్ర అయ్యర్'.

3. ఈ శ్లోకమునకు తుల్యమైనదిగా చెప్పబడు రఘువంశమునందు 7వ సర్గమున గల 23వ శ్లోకమును చూడండి.

శ్లో॥ తయోరపాఙ్గప్రతిసారితాని
క్రియాసమాపత్తినివర్తితాని।
హ్రీయన్త్రణామానశిరే మనోజ్ఞా-
మన్యోన్యలోలాని విలోచనాని॥

**క్రియాదర్శము :– అన్వభూవన్ :–** అను – ఉపసర్గ. 'భూ – సత్తాయామ్' ఇత్యస్మాద్ధాతోస్సకర్మకాత్ కర్తరి భూతేలుఙ్ పరస్మైపదీ ప్రథమపురుషైకబహు వచనాంతః।

అన్వభూత్ – అన్వభూతామ్ – **అన్వభూవన్**

**అన్వభూత్ –** పదప్రయోగమునకై రఘువంశమహాకావ్యమున 1-21 శ్లోకము చూడదగును.

---

**అవతారిక :–** అథ వధూవరయోః పాణిగ్రహణం వర్ణయతి–

**శ్లో॥ తస్యాః కరం శైలగురూపనీతం**
**జగ్రాహ తామ్రాంగులిమష్టమూర్తిః।**
**ఉమాతనౌ గూఢతనోః స్మరస్య**
**తచ్ఛఙ్కినః పూర్వమివ ప్రరోహమ్॥ 76**

**పదవిభాగము :–** తస్యాః, కరమ్, శైలగురూపనీతమ్, జగ్రాహ, తామ్రాంగులిమ్, అష్టమూర్తిః, ఉమాతనౌ, గూఢతనోః, స్మరస్య, తచ్ఛఙ్కినః, పూర్వమ్, ఇవ, ప్రరోహమ్।

**అన్వయక్రమము :–** అష్టమూర్తిః తచ్ఛఙ్కినః ఉమాతనౌ గూఢతనోః స్మరస్య పూర్వం ప్రరోహమ్ ఇవ (స్థితమ్) శైలగురూపనీతం తామ్రాంగులిం తస్యాః కరం జగ్రాహ।

**ప్రతిపదార్థము :–** అష్టమూర్తిః –పంచభూతములు సూర్యచంద్రులు, యజమాని అనెడి అష్టమూర్తులు కలిగిన, (An epithet of siva on account of his having eight bodies - the five elements, the sun, the moon and

94



the sacrificer) తచ్ఛఙ్కినః – హరునియొక్క భీతికి, ఉమాతనౌ – పార్వతీదేవియొక్క శరీరమునందు, గూఢతనోః – రహస్యముగా దాచుకొనిన శరీరముగల, స్మరస్య – మన్మథునియొక్క, పూర్వమ్ – మొదటిదగు, ప్రరోహమివ – అంకురమువలె నున్నదియును, శైలగురూపనీతమ్ – హిమవంతునిచేత అందింపబడిన, తామ్రాంగులిమ్ – ఎఱ్ఱని వ్రేళ్లు గలదియును అగు, తస్యాః – ఆ పార్వతీదేవియొక్క కరమ్ – చేతిని, జగ్రాహ – చేపట్టెను.

**తాత్పర్యము :–** అష్టమూర్తియగు శివభగవానుడు – హరునియొక్క భీతికి పార్వతీదేవియొక్క శరీరమునందు రహస్యముగా దాచుకొనిన శరీరముగల మన్మథునియొక్క మొదటిదగు అంకురమువలె నున్నదియును, హిమవంతునిచేత అందింపబడిన ఎఱ్ఱనివ్రేళ్లుగలదియును అగు ఆ పార్వతీదేవియొక్క చేతిని చేపట్టెను.

**పాఠాన్తరాలు :–**

1. ఉమాతనౌ – ఉమాత్మనా

**విభక్తులు / క్రియలు :–** 1. అష్టమూర్తిః – **అష్టమూర్తిః**, అష్టమూర్తీ, అష్టమూర్తయః; ఇకారాన్తః పుంలింగ అష్టమూర్తిశబ్దః, ప్ర.ఏ. 2. తచ్ఛఙ్కినః – **తచ్ఛఙ్కినః,** తచ్ఛఙ్కినోః, తచ్ఛఙ్కినామ్; నకారాన్తః పుంలింగ స్తచ్ఛఙ్కిన్శబ్దః, ష.ఏ. 3. ఉమాతనౌ – **ఉమాతనౌ,** ఉమాతన్వోః, ఉమాతనుషు; ఉకారాన్తః స్త్రీలింగః, ఉమాతనుశబ్దః, స.ఏ. 4. గూఢతనోః – **గూఢతనోః**, గూఢతన్వోః, గూఢతనూనామ్; ఉకారాన్తః స్త్రీలింగో గూఢతనుశబ్దః, ష.ఏ. 5. స్మరస్య – **స్మరస్య**, స్మరయోః, స్మరాణామ్; అకారాన్తః పుంలింగః స్మరశబ్దః, ష.ఏ. 6. పూర్వమ్ – **పూర్వమ్**, పూర్వౌ, పూర్వాన్; అకారాన్తః పుంలింగః పూర్వశబ్దః, ద్వి.ఏ. 7. ప్రరోహమ్ – **ప్రరోహమ్**, ప్రరోహౌ, ప్రరోహాన్; అకారాన్తః పుంలింగః ప్రరోహశబ్దః, ద్వి.ఏ. 8. ఇవ – అవ్యయము 9. శైలగురూపనీతమ్ – **…ఉపనీతమ్,** …ఉపనీతౌ, …ఉపనీతాన్; అకారాన్తః పుంలింగః …నీతశబ్దః, ద్వి.ఏ. 10. తామ్రాంగులిమ్ – **తామ్రాంగులిమ్**, తామ్రాంగులీ, తామ్రాంగులీన్; ఇకారాన్తః పుంలింగః, తామ్రాంగులిశబ్దః, ద్వి.ఏ. 11. తస్యాః – **తస్యాః**, తయోః, తాసామ్; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః, ష.ఏ. 12. కరమ్ – **కరమ్**, కరౌ, కరాన్; అకారాన్తః పుంలింగః కరశబ్దః, ద్వి.ఏ. 13. జగ్రాహ – క్రియ – లిట్, గ్రహ్ – ధాతువు.

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. అష్టమూర్తిః – అష్టౌ మూర్తయః యస్య సః అష్టమూర్తిః। బహువ్రీహిః।
2. శైలగురూపనీతమ్ – శైలానాం గురుః శైలగురుః, తేన ఉపనీతం శైలగురూప నీతమ్ – తృ.త.
3. తామ్రాంగులిమ్ – తామ్రాః అంగులయః యస్య సః తామ్రాంగులిః, తం తామ్రాంగులిమ్। బహువ్రీహిః।

4. తచ్ఛజ్కినః – తస్మాత్ శఙ్కతే తచ్ఛీల ఇతి తచ్ఛజ్కీ, తస్య తచ్ఛజ్కినః।
5. ఉమాతనౌ – ఉమాయాః తనుః ఉమాతనుః, తస్యామ్ ఉమాతనౌ। ష.త।
6. గూఢతనోః – గూఢా తనుః యస్య సః గూఢతనుః, తస్య గూఢతనోః। బహుౖవ్రీహిః।

**అలంకారాలు :–** అత్రోత్ప్రేక్షయా దర్శనమాత్రేణైవ మనోవికారహేతుత్వం ధ్వన్యతే।

**క్రియాదర్శము :– జగ్రాహ** – గ్రహ (గ్రహ్) ఉపాదానే (స్వీకరించుట), క్ర్యాదయః (9), సకర్మకమ్, సేట్ (ఉభయ) పరస్మైపదీ, లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**జగ్రాహ** – జగృహతుః – జగృహుః

శ్లో॥ తథేత్యుపస్పృశ్య పయః పవిత్రం
సోమోద్భవాయాస్సరితో నృసోమః।
ఉదఙ్ముఖః సోఽ స్త్రవిదస్త్రమంత్రం
**జగ్రాహ** తస్మాన్నిగృహీతశాపాత్॥ – ర.వం. 5-59

---

**అవతారిక :–** పాణిగ్రహణకాలే ప్రవృద్ధరాగయోస్తయోః సాత్వికాన్ భావాన్ వర్ణయతి–

**శ్లో॥ రోమోద్గమః ప్రాదురభూదుమాయాః**
**స్విన్నాంగులిః పుంగవకేతురాసీత్।**
**వృత్తిస్తయోః పాణిసమాగమేన**
**సమం విభక్తేవ మనోభవస్య ॥ 77**

**పదవిభాగము :–** రోమోద్గమః, ప్రాదురభూత్, ఉమాయాః, స్విన్నాంగులిః, పుంగవకేతుః, ఆసీత్, వృత్తిః, తయోః, పాణిసమాగమేన, సమమ్, విభక్తా, ఇవ, మనోభవస్య।

**అన్వయక్రమము :–** ఉమాయాః రోమోద్గమః ప్రాదురభూత్। పుంగవకేతుః స్విన్నాంగులిః ఆసీత్। పాణిసమాగమేన తయోః మనోభవస్య వృత్తిః సమం విభక్తా ఇవ (అభూత్)।

**ప్రతిపదార్థము :–** ఉమాయాః – వధువగు ఉమాదేవికి, రోమోద్గమః – గగుర్పాటు, ప్రాదురభూత్ – ఆవిర్భవించినది. పుంగవకేతుః – వరుడగు వృషధ్వజుడు,





స్విన్నాంగులిః – చెమర్చిన వ్రేళ్లుగలవాడుగా, ఆసీత్ – ఆయెను. పాణిసమాగమేన – పాణిగ్రహణము చేయుటవలన, తయోః – ఆ వధూవరులిరువురకు, మనోభవస్య – మన్మథునియొక్క, వృత్తిః – సాత్వికవికారము, సమమ్ – సమముగా, విభక్తా + ఇవ – విభజింపబడినట్లుండినదిగా, అభూత్ – కలిగెను.

**తాత్పర్యము :–** వధువగు ఉమాదేవికి గగుర్పాటు ఆవిర్భవించినది. వరుడగు వృషధ్వజుడు చెమర్చిన వ్రేళ్లుగలవాడాయెను. పాణిగ్రహణమువలన ఆ వధూవరులిరువురకు మన్మథునియొక్క సాత్వికవికారము సమముగా విభజింపబడినట్లుండినదిగా కలిగెను.

**విభక్తులు / క్రియలు :–** 1. ఉమాయాః – **ఉమాయాః**, ఉమయోః, ఉమానామ్; ఆకారాన్తః స్త్రీలింగ ఉమాశబ్దః, ష.ఏ. 2. రోమోద్గమః – **రోమోద్గమః**, రోమోద్గమౌ, రోమోద్గమాః; అకారాన్తః పుంలింగ రోమోద్గమశబ్దః, ప్ర.ఏ. 3. అభూత్ – క్రియ 4. పుంగవకేతుః – **పుంగవకేతుః**, పుంగవకేతూ, పుంగవకేతవః; ఉకారాన్తః పుంలింగః పుంగవకేతుశబ్దః, ప్ర.ఏ. 5. స్విన్నాంగులిః – **స్విన్నాంగులిః**, స్విన్నాంగులీ, స్విన్నాంగులయః; ఇకారాన్తః పుంలింగః స్విన్నాంగులిశబ్దః, ప్ర.ఏ. 6. ఆసీత్ – క్రియ 7. పాణిసమాగమేన – **పాణిసమాగమేన**, పాణిసమాగమాభ్యామ్, పాణిసమాగమైః; అకారాన్తః పుంలింగః పాణిసమాగమశబ్దః, తృ.ఏ. 8. తయోః – తస్యాః, **తయోః**, తాసామ్; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః, ష.ద్వి. 9. మనోభవస్య – **మనోభవస్య**, మనోభవయోః, మనోభవానామ్; అకారాన్తః పుంలింగో మనోభవశబ్దః, ష.ఏ. 10. వృత్తిః – **వృత్తిః**, వృత్తీ, వృత్తయః; ఇకారాన్తః స్త్రీలింగో వృత్తిశబ్దః, ప్ర.ఏ. 11. సమమ్ – ఎ) అవ్యయము బి) అకారాన్త నపుంసకలింగః 12. విభక్తా – **విభక్తా**, విభక్తే, విభక్తాః ఆకారాన్తః స్త్రీలింగో విభక్తాశబ్దః, ప్ర.ఏ. 13. ఇవ – అవ్యయము – ప్రాదుః।

**సంధులు :–**

1. ప్రాదుః + అభూత్ – ప్రాదురభూత్ – విసర్గసన్ధిః।
2. పుంగవకేతుః + ఆసీత్ – పుంగవకేతురాసీత్ – విసర్గసన్ధిః।
3. వృత్తిః + తయోః – వృత్తిస్తయోః – విసర్గసన్ధిః।
4. విభక్తా + ఇవ – విభక్తేవ – గుణసన్ధిః।
5. రోమ + ఉద్గమః – రోమోద్గమః – గుణసన్ధిః।
6. స్విన్న + అంగులిః – స్విన్నాంగులిః – సవర్ణదీర్ఘసన్ధిః।
7. అభూత్ + ఉమాయాః – అభూదుమాయాః – జశ్త్వసన్ధిః।

**సమాసాలు :–**

1. రోమోద్గమః – రోమ్ణామ్ ఉద్గమః రోమోద్గమః। ష.త।
2. పుంగవకేతుః – పుమాన్ గౌః పుంగవః, పుంగవః కేతుః చిహ్నం యస్య సః పుంగవకేతుః। బహుౖవ్రీహిః।

3. స్విన్నాంగులిః – స్విన్నా అంగులయః యస్య సః స్విన్నాంగులిః। బహుప్రీహిః

4. పాణిసమాగమేన – పాణ్యోః సమాగమః పాణిసమాగమః, తేన। ష.త।

5. మనోభవస్య – మనసి భవః మనోభవః, తస్య మనోభవస్య। స.త।

**పదవృత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

1. రఘువంశమహాకావ్యమునందు సప్తమసర్గలో అజ – ఇందుమతీ కల్యాణ ఘట్టమునందు వ్రాయబడిన **7 –22 శ్లోకభావమునే** మహాకవి శ్రీకాళిదాసు ఈ పార్వతీపరమేశ్వరుల స్వయంవరము నందు కూడా 77వ శ్లోకముగా రచించినాడు.

'ఆసీద్వరః కణ్ఠకితప్రకోష్ఠః
స్విన్నాంగులిః సంవ వృతే కుమారీ।
తస్మిన్ ద్వయే తత్క్షణమాత్మవృత్తిః
సమం విభక్తేవ మనోభవేన॥

2. వధూవరులకు పరస్పరానురాగమున్నదో లేదో పరీక్షించుటకు వీటిని వాత్స్యాయనుడు కామసూత్రమందు చెప్పెను.

'కన్యా తు ప్రథమసమాగమే స్విన్నాంగులిః స్విన్నముఖీ చ భవతి।
పురుషస్తు రోమాంచితో భవతి ఏభిరనయోర్భావం పరీక్షేత।'

ఈ రోమాంచస్వేదోద్గమములు వరునికి వధువునకు ఇదే క్రమమున ఉండవలెనను నియమము మాత్రము లేదు. ఇది ఉపలక్షకము మాత్రమే. వ్యత్యస్తముగా సైతముం డవచ్చునని పై రఘువంశశ్లోకము ద్వారా కననగును.

3. శ్లో॥ తస్య స్ఫురత్పణగణప్రతిపాలనోత్థం
కమ్పం చ వీక్ష్య పులకం చ తతో ను తస్యాః।
సంజాతసాత్త్వికవికారధియః స్వభృత్యాన్
నృత్యాన్న్యషేధదురగాధిపతిర్విలక్షః॥ – ఇతి **నైషధకావ్యే** – 11 –29

**అలంకారాలు :-** అత్రోత్ప్రేక్షాలంకారః। స్వేదరోమాంచప్రాదుర్భావేన సాత్త్వికభావస్య ప్రకాశో ద్యోతతే। సాత్త్వికాస్తు –

'స్తమ్భః స్వేదోఽథ రోమాఞ్చః స్వరభఙ్గోఽథ వేపథుః।
వైవర్ణ్యమశ్రుప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాః స్మృతాః॥ – ఇతి





**క్రియాదర్శము :-** ప్రాదుః – అభూత్ – Manifested, appeared, became visible లుఙ్ of భూ with ప్రాదుః.

**అభూత్** – అభూతామ్ – అభూవన్

---

**అవతారిక :-** ప్రయుక్తపాణిగ్రహణయోః వధూవరయోరాసీత్ కోఽపి శోభావిశేషః

**శ్లో॥ ప్రయుక్తపాణిగ్రహణం యదన్య-**
**ద్వధూవరం పుష్యతి కాన్తిమగ్ర్యామ్।**
**సాన్నిధ్యయోగాదనయోస్తదానీం**
**కిం కథ్యతే శ్రీరుభయస్య తస్య॥** **78**

**పదవిభాగము :-** ప్రయుక్తపాణిగ్రహణమ్, యత్, అన్యత్, వధూవరమ్, పుష్యతి, కాన్తిమ్, అగ్ర్యామ్, సాన్నిధ్యయోగాత్, అనయోః, తదానీమ్, కిమ్, కథ్యతే, శ్రీః, ఉభయస్య, తస్య।

**అన్వయక్రమము :-** యత్, ప్రయుక్తపాణిగ్రహణమ్ అన్యత్ వధూవరమ్ అనయోః సాన్నిధ్యయోగాత్ అగ్ర్యామ్ కాన్తిం పుష్యతి, తదానీం తస్య ఉభయస్యశ్రీః కిం కథ్యతే?

**ప్రతిపదార్థము :-** యత్ – ఏ కారణమువలన, యస్మాత్ కారణాత్, ప్రయుక్తపాణిగ్రహణమ్ – ప్రారబ్ధవివాహము, అన్యత్ – మల్లియును, వధూవరమ్ – దంపతులగు, అనయోః – వీరికి, సాన్నిధ్యయోగాత్ – సామీప్యమువలన, అగ్ర్యామ్ – ప్రసిద్ధమైన, కాన్తిమ్ – శోభను, పుష్యతి – తెచ్చిపెట్టును. తదానీమ్ – నేడు, తస్య – ఈ, ఉభయస్య – జంటకు (పార్వతీపరమేశ్వరులకు) శ్రీః – కల్యాణశోభ, కిం కథ్యతే – సంపూర్ణముగా ఉండదా ఏమి?

**తాత్పర్యము :-** సాధారణ వధూవరులకు పాణిగ్రహణము జరిగినచో అది వారికొక శోభను తెచ్చును అన్నచో, నేడు ఈ జంటకు కల్యాణశోభ సంపూర్ణముగా ఉండదా ఏమి? అనగా ఉండితీరునని భావము.

**విభక్తులు / క్రియలు :-** 1. యత్ – యస్మాత్ కారణాత్ – అవ్యయము 2. ప్రయుక్తపాణిగ్రహణమ్ – **...గ్రహణమ్,** ...గ్రహణే, ...గ్రహణాని; అకారాన్త నపుంసకలింగః ...గ్రహణశబ్దః, ప్ర.ఏ. 3. అన్యత్ – అవ్యయము 4. వధూవరమ్ – సమాహార ద్విపదద్వన్ద్వః – ఇది ఏకవచనమున మాత్రమే ఉండును. 5. అనయోః – అస్య, **అనయోః**, ఏషామ్; మకారాన్తః పుంలింగ ఇదమ్‌శబ్దః, ష.ద్వి. 6.

సాన్నిధ్యయోగాత్ – **సాన్నిధ్యయోగాత్**, సాన్నిధ్యయోగాభ్యామ్, సాన్నిధ్యయోగేభ్యః; అకారాన్తః పుంలింగః సాన్నిధ్యయోగశబ్దః, పం.ఏ. 7. అగ్ర్యామ్ – **అగ్ర్యామ్**, అగ్ర్యే, అగ్ర్యాః; ఆకారాన్తః స్త్రీలింగ అగ్ర్యాశబ్దః ద్వి.ఏ. 8. కాన్తిమ్ – **కాన్తిమ్**, కాన్తీ, కాన్తీః; ఇకారాన్తః స్త్రీలింగః కాన్తిశబ్దః, ద్వి.ఏ. 9. పుష్యతి – కియ 10. తదానీమ్ – అవ్యయము 11. తస్య – **తస్య**, తయోః, తేషామ్; దకారాన్తః పుంలింగస్తచ్ఛబ్దః, ష.ఏ. 12. ఉభయస్య – **ఉభయస్య,** ఉభయేషామ్; అకారాన్తః పుంలింగః ఉభయశబ్దో ద్వివచనరహితః ష.ఏ. 13. శ్రీః – **శ్రీః**, శ్రియౌ, శ్రియః; ఈకారాన్తః స్త్రీలింగః శ్రీశబ్దః, ప్ర.ఏ. 14. కిమ్ – అవ్యయము 15. కథ్యతే – క్రియ.

**సంధులు :–**

1. అనయోః + తదానీమ్ – అనయోస్తదానీమ్ – విసర్గసన్ధిః।
2. శ్రీః + ఉభయస్య – శ్రీరుభయస్య – విసర్గసన్ధిః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. ప్రయుక్తపాణిగ్రహణమ్ – పాణేః గ్రహణం పాణిగ్రహణమ్, ప్రయుక్తం పాణిగ్రహణమ్ యస్య తత్ ప్రయుక్తపాణిగ్రహణమ్। బహువ్రీహిః।
2. అనయోః – ఇయం చ అయం చ ఇమౌ, తయోః అనయోః – ఏకశేషః।
3. సాన్నిధ్యయోగాత్ – సన్నిధేః భావః సాన్నిధ్యం, సాన్నిధ్యస్య యోగః సాన్నిధ్యయోగః, తస్మాత్ సాన్నిధ్యయోగాత్। ష.త।
4. అగ్ర్యామ్ – అగ్రే భవా అగ్ర్యా, తామ్ అగ్ర్యామ్। తద్ధితవృత్తిః।
5. వధూవరమ్ – వధూశ్చ వరశ్చ తయోః సమాహారః వధూవరమ్। సమాహార ద్విపదద్వన్ద్వః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

1. 'వివాహసమయే గౌరీశివౌ వధూవరావనుప్రవేశతామ్' ఇత్యాగమః.

'వివాహకాలమునందు గౌరీశివులు వధూవరులలోనికి ప్రవేశించుదురు.' అను ఆగమవాక్యానుసారము వధూవరులకొక కల్యాణశోభ వచ్చుట పరిపాటి. నేడు ఆ గౌరీశివులే వధూవరులైనచో వారియందాశోభ ఎట్లుండునో వర్ణించుటకు సాధ్యపడునా? అనగా ఆ కల్యాణశోభ పుష్కలమని భావము.

2. 'వధూరుమాత్మికా భర్తా శంకరాత్మకః' – అనే వచనాన్ని 'వివరణమ్' వ్యాఖ్య పేర్కొన్నది.





**3. వివాహః –**

ఎ) విశిష్టం వహనమ్। వి + వహ్ + ఘఞ్। దారపరిగ్రహః।

బి) బ్రాహ్మో వివాహ ఆహుయ దీయతే శక్త్యలఙ్కృతా।
తజ్జః పునాత్యుభయతః పురుషానేకవింశతిమ్।
యజ్ఞస్థాయర్త్విజే దైవమాదాయార్షస్తు గోయుగమ్।
చతుర్దశ ప్రథమజః పునాత్యుత్తరజశ్చ షట్।
ఇత్యుక్త్వా చరతాం ధర్మ సహ యా ధీయతేఽర్థినే।
సకాయః పావయేత్తజ్జః షడ్ వశ్యాంశ్చ సహాత్మనా।
ఆసురో ద్రవిణాదానాత్ గాన్ధర్వః సమయాన్మిథః।
రాక్షసో యద్ధహరణాత్ పైశాచః కన్యకాచ్ఛలాత్।। – ఇతి యాజ్ఞవల్క్యః।

**4. ఉభయస్య –**

ఎ) ఉభయశబ్దస్య ద్వివచనం నాస్తీతి కైయటః అస్తీతి హరదత్తః (సిద్ధాన్తకౌముది – పాణి – 1–52)

శ్లో।। తస్య మిత్రాణ్యమిత్రాస్తే యే యే చ **చోభయే** నృపాః।
అభియుక్తం త్వయైనం తే గంతారస్త్వామతోఽపరే।।
– ఇతి మాఘకావ్యే 2–101

బి) శ్లో।। ముదితయువమనస్కాస్తుల్యమేవ ప్రదోషే
రుచమదధురుభయ్యః కల్పితా భూషితాశ్చ।...
– ఇతి మాఘకావ్యే 11 –27

సి) శ్లో।। తతృషుశ్వోభయే భటాః – ఇతి భట్టికావ్యే 14 –30

**అలంకారాలు :–** అత్ర **'అర్థాపత్తిరలంకారః'** 'శ్రీఃకిమ్ కథ్యతే'। అని ప్రయోగించుటచే ఇట అర్థాపత్తిరలంకారము చెప్పదగును.

**క్రియాదర్శము :– కథ్యతే –** కథ – 'వాక్యప్రబన్ధే' సకర్మకమ్, సేట్, (ఉభయ), ఆత్మనేపదీ, చురాదయః, కర్మణి ప్రయోగము.

**కథ్యతే** – కథ్యేతే – కథ్యన్తే

---

**అవతారిక :–** వధూవరకృతం వహ్నిప్రదక్షిణం వర్ణయతి –

**శ్లో॥ ప్రదక్షిణప్రక్రమణాత్కృశానో–**
**రుదర్చిషస్తన్మిథునం చకాసే।**
**మేరోరుపాన్తేష్వివ వర్తమాన–**
**మన్యోన్యసంసక్తమహస్త్రియామమ్॥ 79**

**పదవిభాగము :–** ప్రదక్షిణప్రక్రమణాత్, కృశానోః, ఉదర్చిషః, తత్ + మిథునమ్, చకాసే, మేరోః, ఉపాన్తేషు, ఇవ, వర్తమానమ్, అన్యోన్యసంసక్తమ్, అహస్త్రియామమ్।

**అన్వయక్రమము :–** తత్మిథునమ్ అన్యోన్యసంసక్తమ్ (సత్) ఉదర్చిషః, కృశానోః ప్రదక్షిణప్రక్రమణాత్ మేరోః ఉపాన్తేషు, వర్తమానమ్ అన్యోన్యసంసక్తమ్ అహస్త్రియామమ్ ఇవ చకాసే।

**ప్రతిపదార్థము :–** తత్ మిథునమ్ – ఆ దంపతుల జంట, అన్యోన్యసంసక్తమ్ – పరస్పరము కలిసికొన్నది అగుచు, ఉదర్చిషః – ఎగయుచున్న జ్వాలలు గల, కృశానోః – అగ్నియొక్క, ప్రదక్షిణప్రక్రమణాత్ – ప్రదక్షిణారంభమువలన, మేరోః – మేరుపర్వతముయొక్క, ఉపాన్తేషు – సమీపప్రదేశములయందు వర్తమానమ్ – తిరుగుచున్నట్టియు, అన్యోన్యసంసక్తమ్ – పరస్పరము కలిసికొన్నదియునగు, అహస్త్రియామమ్ + ఇవ – ఆహోరాత్రుల జంటవలె చకాసే – ప్రకాశించెను.

**విభక్తులు / క్రియలు :–** 1. తత్ + మిథునమ్ – **మిథునమ్**, మిథునే, మిథునాని; అకారాన్త నపుంసకలింగో మిథునశబ్దః, ప్ర.ఏ. 2. అన్యోన్యసంసక్తమ్ – **...సంసక్తమ్,** ...సంసక్తే, ...సంసక్తాని; అకారాన్త నపుంసకలింగ...సంసక్తశబ్దః, ప్ర.ఏ. 3. ఉదర్చిషః – **ఉదర్చిషః**, ఉదర్చిషోః, ఉదర్చిషామ్; సకారాన్తః పుంలింగ ఉదర్చిశ్శబ్దః, ష.ఏ. 4. కృశానోః – **కృశానోః**, కృశాన్వోః, కృశానూనామ్; ఉకారాన్తః పుంలింగః కృశానుశబ్దః, ష.ఏ. 5. ప్రదక్షిణప్రక్రమణాత్ – **...క్రమణాత్**, ...క్రమణాభ్యామ్, ...క్రమణేభ్యః; అకారాన్త నపుంసకలింగః ...క్రమణశబ్దః, పం.ఏ. 6. మేరోః – **మేరోః**, మేర్వోః, మేరూణామ్; ఉకారాన్తః పుంలింగో మేరుశబ్దః, ష.ఏ. 7. ఉపాన్తేషు – ఉపాన్తే, ఉపాన్తయోః, **ఉపాన్తేషు;** అకారాన్తః పుంలింగ ఉపాన్తశబ్దః, స.బ. 8. వర్తమానమ్ – **వర్తమానమ్**, వర్తమానే, వర్తమానాని; అకారాన్త నపుంసకలింగో వర్తమానశబ్దః, ద్వి.ఏ. 9. అహస్త్రియామమ్ – సమాహారద్వన్ద్వః – ఏకవచనములోనే ఉండును. ద్వి.ఏ. (స్త్రీ.) 10. ఇవ – అవ్యయము 11. చకాసే – క్రియ.

**సంధులు :–**

1. కృశానోః + ఉదర్చిషః – కృశానోరుదర్చిషః – విసర్గసన్ధిః।
2. ఉదర్చిషః + తత్ – ఉదర్చిషస్తత్ – విసర్గసన్ధిః।





3. తత్ + మిథునమ్ – తన్మిథునమ్ – **అనునాసికసన్ధిః।**
యరోఽనునాసికే అనునాసికో వా (సూ 8–4–44), రహలు తప్ప తక్కిన పదాంతమందలి హల్లులకు (యర్రులకు) అనునాసికవర్ణము పరముగా నున్నచో ఆయావర్గాలకు సంబంధించిన అనునాసిక (ఙ మ జ ణ న) వర్ణమాదేశముగ, వికల్పముగ వచ్చును.
4. మేరోః + ఉపాన్తేషు – మేరోరుపాన్తేషు – విసర్గసన్ధిః।
5. ఉపాన్తేషు + ఇవ – ఉపాన్తేష్వివ – యణాదేశసన్ధిః (ఇకోయణచి)
6. ఉప + అన్తేషు – ఉపాన్తేషు – సవర్ణదీర్ఘసన్ధిః।

**సమాసాలు :–**

1. తన్మిథునమ్ – తయోః మిథునమ్ తన్మిథునమ్। ష.త.
2. ఉదర్చిషః – ఉద్గతా అర్చిః యస్య సః ఉదర్చిః తస్య ఉదర్చిషః। బహువ్రీహిః
3. ప్రదక్షిణప్రక్రమణాత్ – ప్రదక్షిణం చ తత్ ప్రక్రమణం ప్రదక్షిణప్రక్రమణమ్, తస్మాత్, ప్రదక్షిణప్రక్రమణాత్।...కర్మధారయః।
4. అన్యోన్యసంసక్తమ్ – అన్యోన్యేన సంసక్తమ్ – అన్యోన్యసంసక్తమ్। తృ.త।
5. అహస్త్రియామమ్ – త్రయః యామాః యస్యాః సా త్రియామా (బహువ్రీహిః) అహశ్చ త్రియామా చ అహస్త్రియామం, సమాహారే ద్వంద్వైకవద్భావః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. కృశానుః – (పుం.) –** ఎ) కృశ్యతి తనూకరోతి తృణకాష్ఠాదివస్తుజాతమితి। 'ఋతన్యఞ్జీతి' ఆనుక్ ప్రత్యయః। బి) పృషోదరాదిత్వాత్ షత్వే కృషాణు రిత్యపి।

సి) శ్లో॥ సప్తార్చిర్బృహలః శిఖీ హుతవహో వైశ్వానరోఽగ్నిర్వసు–
రృహ్నిర్వాయుసఖః సితేతరగతిః స్వాహాప్రియః పావకః।
అర్చిష్మాన్ జ్వలనః **కృశాను**రనలో ధూమధ్వజో హవ్యవాట్
బర్హిర్జ్యోతిరుషర్బుధశ్చ దహనః స్యాచ్చిత్రభానుః శుచిః ॥ 62

శ్లో॥ కృపీటయోనిర్దమునాః కృష్ణవర్త్మాశుశుక్షణిః।
విభావసురపాంపత్తం జాతవేదాస్తనూనపాత్॥ 63

శ్లో॥ వీతిహోత్రో వృహద్భానురాశ్రయాశో ధనఞ్జయః।

హిరణ్యరేతాస్తమోఘ్నో రోహితాశ్వో హుతాశనః॥ 64

– అని హలాయుధకోశము '39' నామములను పేర్కొన్నది.

**డి) 'అజ – ఇందుమతుల' వివాహసందర్భమును వర్ణించునపుడును రఘువంశమున (7–24) కాళిదాసమహాకవి ఈ శ్లోకమునే యథాతథముగా ఉంచినాడని గమనించగలరు.**

**అలంకారాలు :–** అత్ర 'ఉపమాలంకారః'। 'సువర్ణం తైజసమ్' అని చెప్పబడుటచేత మేరుపర్వతము అగ్నితో పోల్చబడినది. అహస్సు శివుడుగాను, పార్వతీదేవి త్రియామ గాను ఉపమింపబడినారు.

**క్రియాదర్శము :– చకాశే** – లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।

'కాశృ – దీప్తౌ' అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ.

**చకాశే** – చకాశాతే – చకాశిరే

---

**అవతారిక :–** అగ్నిప్రదక్షిణం లాజహోమాఖ్యం కర్మ చ వర్ణయతి –

**శ్లో॥ తౌ దమ్పతీ త్రిః పరిణీయ వహ్నిమ్**
**అన్యోన్యసంస్పర్శనిమీలితాక్షౌ।**
**స కారయామాస వధూం పురోధా–**
**స్తస్మిన్సమిద్ధార్చిషి లాజమోక్షమ్॥ 80**

**పదవిభాగము :–** తౌ, దమ్పతీ, త్రిః, పరిణీయ వహ్నిమ్, అన్యోన్యసంస్పర్శ–నిమీలితాక్షౌ, సః, కారయామాస, వధూమ్, పురోధాః, తస్మిన్, సమిద్ధార్చిషి, లాజమోక్షమ్।

**అన్వయక్రమము :–** సః పురోధాః అన్యోన్య...నిమీలితాక్షౌ తౌ దమ్పతీ వహ్నిం త్రిః పరిణీయ, సమిద్ధార్చిషి తస్మిన్ వధూం లాజమోక్షం కారయామాస॥

**ప్రతిపదార్థము :–** సః – ఆ, పురోధాః – పురోహితుడు, అన్యోన్యసంస్పర్శనిమీలితాక్షౌ – ఒకరినొకరు తాకుటవలన కలిగినస్పర్శతో కన్నులు మూసికొనియున్న, తౌ – ఆ, దమ్పతీ – శివపార్వతుల జంటను, వహ్నిమ్ – అగ్నికి, త్రిః – మూడుసార్లు, పరిణీయ – ప్రదక్షిణము చేయించి, సమిద్ధార్చిషి – ప్రదీప్తమైన జ్వాలలుగల,



తస్మిన్ – ఆ అగ్నిహోత్రమునందు, వధూమ్ – పార్వతినిగురించి, లాజమోక్షమ్ – లాజమోక్షమును (పేలాలతో హోమమును) కారయామాస – చేయించెను.

**తాత్పర్యము :–** ఆ పురోహితుడు – ఒకరినొకరు తాకుటవలన కలిగిన స్పర్శతో కన్నులు మూసికొనియున్న ఆ శివపార్వతుల జంటను అగ్నికి మూడుసార్లు ప్రదక్షిణము చేయించి, ప్రదీప్తమైన జ్వాలలుగల ఆ అగ్నిహోత్రమునందు పార్వతిని గురించి లాజహోమమును చేయించెను.

**పాఠాన్తరాలు :–** 1. అన్యోన్య ... – కరాగ్ర...।

**విభక్తులు / క్రియలు :–** 1. సః – **సః**, తౌ, తే; దకారాన్తః పుంలింగ స్తచ్ఛబ్దః, ప్ర.ఏ. 2. పురోధాః – **పురోధాః**, పురోధసౌ, పురోధసః; సకారాన్తః పుంలింగః పురోధస్‌శబ్దః, ప్ర.ఏ. 3. అన్యోన్యసంస్పర్శనిమీలితాక్షౌ – ...అక్షః, **...అక్షౌ**, ...అక్షాః; అకారాన్తః పుంలింగః.... అక్షశబ్దః, ప్ర.ద్వి. 4. తౌ – సః, **తౌ**, తే; దకారాన్తః పుంలింగస్తచ్ఛబ్దః, ప్ర.ద్వి. 5. దమ్పతీ – ఇకారాన్తః పుంలింగః, ద్వివచనమ్, భార్యాభర్తారౌ దంపతులు. 6. వహ్నిమ్ – **వహ్నిమ్**, వహ్నీ, వహ్నీన్; ఇకారాన్తః పుంలింగో వహ్నిశబ్దః, ద్వి.ఏ. 7. త్రిః –అవ్యయము – సకారాన్తము. 8. పరిణీయ – ల్యబన్తమవ్యయము 9. సమిద్ధార్చిషి – **సమిద్ధార్చిషి**, సమిద్ధార్చిషోః, సమిద్ధార్చిషు; సకారాన్త నపుంసకలింగ...అర్చిస్‌శబ్దః, స.ఏ. 10. తస్మిన్ – **తస్మిన్**, తయోః, తేషు; దకారాన్తః నపుంసకలింగస్తచ్ఛబ్దః, ద్వి.ఏ. 11. వధూమ్ – **వధూమ్**, వధ్వౌ, వధూః; ఊకారాన్తః స్త్రీలింగో వధూశబ్దః, ద్వి.ఏ. 12. లాజమోక్షమ్ – **లాజమోక్షమ్,** లాజమోక్షౌ, లాజమోక్షాన్; అకారాన్తః పుంలింగో లాజమోక్షశబ్దః, ద్వి.ఏ. 13. కారయామాస – క్రియ – ణిజన్తము।

**సంధులు :–**

1. సః + కారయామాస – స కారయామాస – సులోపః।
2. పురోధాః + తస్మిన్ – పురోధాస్తస్మిన్ – విసర్గసన్ధిః।
3. సమిద్ధ + అర్చిషి – సమిద్ధార్చిషి – సవర్ణదీర్ఘసన్ధిః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. పురోధాః – పురస్తాత్ ఏవ హితం విధత్త ఇతి పురోధాః।
2. అన్యోన్యసంస్పర్శనిమీలితాక్షౌ – సమ్యక్ స్పర్శః సంస్పర్శః, అన్యోన్యస్య సంస్పర్శః అన్యోన్యసంస్పర్శః, నిమీలితే అక్షిణీ యయోః తౌ నిమీలితాక్షౌ, **(బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్షచ్'** ఇతి షచ్ప్రత్యయః) అన్యోన్యసంస్పర్శేన నిమీలితాక్షౌ అన్యోన్యసంస్పర్శ నిమీలితాక్షౌ, తౌ। తృ.త।

3. దమ్పతీ – జాయా చ పతిశ్చ దమ్పతీ, తౌ। జాయాశబ్దస్య దమ్భావో నిపాతితః ద్వన్ద్వసమాసః।

4. సమిద్ధార్చిషి – సమ్యగ్ ఇద్ధా సమిద్ధా, సా అర్చిః యస్య సః సమిద్ధార్చిః। తస్మిన్ సమిద్ధార్చిషి। బహుబ్రీహిః।

5. లాజమోక్షమ్ – లాజానాం మోక్షః లాజమోక్షః। తమ్ లాజమోక్షమ్। ష.త।

**పదవ్యుత్పత్తి -నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. లాజాః -**

ఎ) అకారాన్తః పుంలింగః – భృష్టధాన్యమ్ – బహువచనాంతోஉయమ్। పేలాలు

బి) భూమ్ని। లజ్యన్తే యే తే। లజ్ + ఘఞ్। అక్షతాః।

సి) శ్లో॥ ఏతే చ వ్రీహయో భృష్టాస్తే లాజా ఇతి సంజ్ఞితాః।
యవాదయశ్చ యే భృష్టాస్తే ధానాః పరికీర్తితాః।
లాజాశ్చ యవధానాశ్చ తర్పణాః పిత్తనాశనాః।
గోధూమయావనాలోత్థాః కిఞ్చిదుష్ణాశ్చ దీపనాః।
తృష్ణాతిసారశమనో ధాతుసామ్యకరః పరః।
మన్దాగ్నివిషమాగ్నీనాం బాలస్థవిరయోషితామ్।
దేయశ్చ సుకుమారాణాం లాజమణ్డః సుసంస్కృతః।
– ఇతి రాజనిఘంటుః।

డి) లాజా – (స్త్రీ.) అక్షతమ్;

1. 'పైత్తికం శర్కరాలాజామధుకైః సారివాయుతైః'। ఇతి సుశ్రుతే (4-16)

ఇ) లాజమ్ (నపుం.) – 1. లాజ్ + అచ్। భృష్టధాన్యమ్।

శ్లో॥ యేషాం స్యుస్తణ్డులాస్తాని ధాన్యాని సతుషాణి చ।
భృష్టాని స్ఫుటితాన్యాహుర్లాలానీతి మనీషిణః।
లాజాః స్యుర్మధురాః శీతా లఘవో దీపనాశ్చ తే।
స్వల్పమూత్రమలా రూక్షా వల్యాః పిత్తకఫచ్ఛిదః।
చర్ద్యతిసారదాహాస్రమేవాయేదస్తృషాపహాః। – ఇతి భావప్రకాశః।

ఎఫ్) లాజహోమపు విశేషములను వ్యాఖ్యానకారులు పలువురు ఇట్లు వివరించినారు.

1. 'శమీపల్లవమిశ్రాన్ లాజక అంజలినా వపతి' (ఇతి కాత్యాయనః)



2. 'లాజహోమం కృత్వా ధూమమాజిఘ్రత్' (ఇతి గృహ్యావిదః)
3. 'అన్యే తు వృద్ధాచారాద్ధూమగ్రహణమిత్యాహుః' (ఇతి దినకరః)
4. లాజహోమం కృత్వా ధూమం గృహ్ణన్తీతి వృద్ధాచారః (ఇతి సుమతిః)

జి) శ్లో॥ నితమ్బగుర్వీ గురుణా ప్రయుక్తా
వధూర్విధాతృప్రతిమేన తేన।
చకార సా మత్తచకోరనేత్రా
లజ్జావతీ **లాజ**విసర్గమగ్నౌ॥ – ర.వం. 7-25

**క్రియాదర్శము :- కారయామాస** – లిట్ – ప్రథమపురుషైకవచనాంతః
**కారయామాస** – కారయామాసతుః – కారయామాసుః

---

**అవతారిక :-** సదాచారప్రాప్తం లాజధూమగ్రహణం వర్ణయతి–

**శ్లో॥ సా లాజధూమాఞ్జలిమిష్టగన్ధం**
**గురూపదేశాద్వదనం నినాయ।**
**కపోలసంసర్పిశిఖః స తస్యాః**
**ముహూర్తకర్ణోత్పలతాం ప్రపేదే॥** **81**

**పదవిభాగము :-** సా, లాజధూమాఞ్జలిమ్, ఇష్టగన్ధమ్, గురూపదేశాత్, వదనమ్, నినాయ, కపోలసంసర్పిశిఖః, సః, తస్యాః ముహూర్తకర్ణోత్పలతామ్, ప్రపేదే।

**అన్వయవిభాగము :-** సా గురూపదేశాత్ ఇష్టగంధం లాజధూమాఞ్జలిం వదనం నినాయ। కపోలసంసర్పిశిఖః, సః తస్యాః ముహూర్తకర్ణోత్పలతామ్ ప్రపేదే।

**ప్రతిపదార్థము :-** సా – ఆ వధువు, గురూపదేశాత్ – పురోహితుని ఉపదేశమువలన, ఇష్టగంధమ్ – సువాసనగల, లాజధూమాఞ్జలిమ్ – లాజ ధూమాంజలిని, వదనమ్ – ముఖమువద్దకు, నినాయ – చేర్చెను. కపోలసంసర్పిశిఖః – గణ్డప్రసర్పిశిఖయైన – చెక్కిళ్లయందు ప్రాకుచున్న కొనలుగలదియైన, సః – ఆ ధూమము, తస్యాః – ఆ పార్వతీదేవికి, ముహూర్తకర్ణోత్పలతామ్ – క్షణకాలముపాటు కర్ణోత్పలముగాను, ప్రపేదే – పొందెను (అయ్యెను.)

**తాత్పర్యము :-** ఆ వధువు పురోహితుని ఉపదేశమువలన సువాసనగల లాజ ధూమాంజలిని ముఖమువద్దకు చేర్చెను. గణ్డప్రసర్పిశిఖయైన ఆ ధూమము ఆ

పార్వతీదేవికి క్షణకాలముపాటు కర్ణోత్పలముగా ఆభరణమై పోయినది.

**విభక్తులు / క్రియలు :–** 1. సా – **సా**, తే, తాః; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః, ప్ర.ఏ. 2. గురూపదేశాత్ – **గురూపదేశాత్**, గురూపదేశాభ్యామ్, గురూపదేశేభ్యః; అకారాన్తః పుంలింగో గురూపదేశశబ్దః, పం.ఏ. 3. ఇష్టగంధమ్ – **ఇష్టగంధమ్**, ఇష్టగన్ధౌ, ఇష్టగన్ధాన్; అకారాన్తః పుంలింగ ఇష్టగంధశబ్దః, ద్వి.ఏ. 4. లాజధూమాఞ్జలిమ్ – **...అఞ్జలిమ్,** ...అఞ్జలీ, ...అఞ్జలీన్; ఇకారాన్తః పుంలింగః, లాజధూమాఞ్జలిశబ్దః, ద్వి.ఏ. 5. వదనమ్ – **వదనమ్**, వదనే, వదనాని; అకారాన్తః నపుంసకలింగో వదనశబ్దః, ద్వి.ఏ. 6. నినాయ – క్రియ. 7. కపోలసంసర్పిశిఖః – **...శిఖః,** ...శిఖౌ, ...శిఖాః; అకారాన్తః పుంలింగః కపోల...శిఖశబ్దః, ప్ర.ఏ. 8. సః – **సః**, తౌ, తే; దకారాన్తః పుంలింగస్తచ్ఛబ్దః, ప్ర.ఏ. 9. తస్యాః – **తస్యాః**, తయోః, తాసామ్; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః, ష.ఏ. 10. ముహూర్తకర్ణోత్పలతామ్ – **...ఉత్పలతామ్**, ...ఉత్పలతే, ...ఉత్పలతాః; ఆకారాన్తః స్త్రీలింగో ...ఉత్పలతాశబ్దః, ద్వి.ఏ. 11. ప్రపేదే – క్రియ.

**సంధులు :–**

1. గురూపదేశాత్ + వదనమ్ – గురూపదేశాద్వదనమ్ – జశ్త్వసన్ధిః
2. సః + తస్యాః – స తస్యాః – సులోపః
3. ధూమ + అఞ్జలిమ్ – ధూమాఞ్జలిమ్ – సవర్ణదీర్ఘసన్ధిః
4. కర్ణ + ఉత్పలతామ్ – కర్ణోత్పలతామ్ – గుణసన్ధిః

**సమాసాలు :–**

1. గురూపదేశాత్ – గురోః ఉపదేశః గురూపదేశః, తస్మాద్ గురూపదేశాత్ – ష.త।
2. ఇష్టగంధమ్ – ఇష్టః గన్ధః యస్య స ఇష్టగంధః, తమ్ ఇష్టగన్ధమ్ – బహువ్రీహిః
3. లాజధూమాఞ్జలిమ్ – లాజానాం ధూమా లాజధూమాః, తేషామ్ అఞ్జలిః లాజధూమాంజలిః, తమ్ లాజధూమాఞ్జలిమ్, ష.త।
4. కపోలసంసర్పిశిఖః – కపోలయోః సంసర్పిణ్యః, కపోలసంసర్పిణ్యః, తాః శిఖా యస్య సః కపోలసంసర్పిశిఖః – బహువ్రీహిః
5. ముహూర్తకర్ణోత్పలతామ్ – కర్ణస్య ఉత్పలం కర్ణోత్పలం, తస్య భావః కర్ణోత్పలతా, ముహూర్తం యథా కర్ణోత్పలతా ముహూర్తకర్ణోత్పలతా, తామ్ ముహూర్తకర్ణోత్పలతామ్। కర్మధారయః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

1. **రఘువంశమహాకావ్యము** – 7–26ను ఇట అనుసంధానము చేసికొనదగును.

101



శ్లో॥ హవిః శమీపల్లవలాజగన్ధీ
పుణ్యః కృశానోరుదియాయ ధూమః।
**కపోలసంసర్పిశిఖః స తస్యాః**
**ముహూర్తకర్ణోత్పలతాం ప్రపేదే॥**

"ఆ పొగయొక్క పైపైకి వ్యాపించు శిఖయే వధువగు ఇందుమతీదేవికి క్షణకాలము పాటు కర్ణోత్పలముగా ఆభరణమై పోయినది."

**అలంకారాలు :–** అత్ర నిదర్శనలంకారః। తల్లక్షణం యథా–
సమ్భవన్ వస్తుసమ్బన్ధోఽసమ్భవన్ వాపి కుత్రచిత్।
యత్ర బిమ్బానుబిమ్బత్వం బోధయేత్ సా నిదర్శనా॥ ఇతి (పుంసవనీవ్యాఖ్య)

2. అత్ర 'ఉత్ప్రేక్షాలంకారః' – హోమధూమరేఖలకు గల పరిమళము, నీలిమయు ఉత్పలముగా నుపమించుటకు సహకరించినవి. అవి పార్వతీదేవి స్వచ్ఛమైన చెక్కిళ్ళపై వ్రాలిన కలువరేకులవలె నుండుటను 'ఇవ' మొదలగు పదములులేక చెప్పుటవలన నిది 'గమ్యోత్ప్రేక్ష' – అని కేశవపంతులుగారు.

**క్రియాదర్శము :– 1. ప్రపేదే –**31వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడగలరు.

---

**అవతారిక :–** ఆచారధూమగ్రహణేన కిఞ్చిత్క్లిన్నరక్తకపోలం పార్వతీముఖమ్ అతితరాం బభాసే –

**శ్లో॥ తదీషదార్ద్రారుణగణ్డలేఖ–**
**ముచ్ఛ్వాసికాలాఞ్జనరాగమక్ష్ణోః।**
**వధూముఖం క్లాన్తయవావతంస–**
**మాచారధూమగ్రహణాద్బభూవ॥ 82**

**పదవిభాగము :–** తత్, ఈషత్, ఆర్ద్రారుణగణ్డలేఖమ్, ఉచ్ఛ్వాసికాలాఞ్జన రాగమ్, అక్ష్ణోః, వధూముఖమ్, క్లాన్తయవావతంసమ్, ఆచారధూమగ్రహణాత్, బభూవ।

**అన్వయక్రమము :–** తత్ వధూముఖమ్ ఆచారధూమగ్రహణాత్ ఈషత్, ఆర్ద్రారుణగణ్డలేఖమ్ అక్ష్ణోః ఉచ్ఛ్వాసికాలాఞ్జనరాగం క్లాన్తయవావతంసం బభూవ।

**ప్రతిపదార్థము :–** తత్ వధూముఖమ్ – ఆ వధూముఖము, ఆచారధూమగ్రహణాత్ – సంప్రదాయానుసారముగా పొగను ముఖమునకు తాకించుటవలన, ఈషత్ + ఆర్ద్రారుణగణ్డలేఖమ్ – కొంచెము చెమటతో తడిసి ఎఱుపెక్కిన గండపత్రలేఖలు కలదియును, అక్ష్ణోః – కళ్లకు, ఉచ్ఛ్వాసికాలాఞ్జనరాగమ్ – పెల్లుబికిన కాటుక కలదియును, క్లాన్తయవావతంసమ్ – వాడిన యవాంకురముకలదియు (చెవిలో పెట్టుకొనిన) బభూవ– అయ్యెను.

**తాత్పర్యము :–** ఆ వధూముఖము సంప్రదాయానుసారముగా పొగను ముఖమునకు తాకించుటవలన 1. కొంచెము చెమటతో తడిసి ఎఱుపెక్కిన గండపత్రలేఖలు కలదియును, 2. కళ్లకు పెల్లుబికిన కాటుకకలదియును 3. వాడిన యవాంకురము కలదియును అయ్యెను.

**విభక్తులు / క్రియలు :–** 1. తత్ – **తత్**, తే, తాని; దకారాన్త నపుంసకలింగస్తచ్ఛబ్దః, ద్వి.ఏ. 2. వధూముఖమ్ – **వధూముఖమ్**, వధూముఖే, వధూముఖాని; అకారాన్త నపుంసకలింగో వధూముఖశబ్దః ప్ర.ఏ. 3. ఆర్ద్రారుణగణ్డలేఖమ్ – **...లేఖమ్**, ...లేఖే, ...లేఖాని; అకారాన్త నపుంసకలింగః...లేఖశబ్దః ద్వి.ఏ. 4. ఆచారధూమగ్రహణాత్ – **...గ్రహణాత్**, ...గ్రహణాభ్యామ్, ...గ్రహణేభ్యః; అకారాన్త నపుంసకలింగః, ఆచారధూమగ్రహణశబ్దః, పం.ఏ. 5. అక్ష్ణోః – అక్ష్ణః, **అక్ష్ణోః**, అక్ష్ణామ్; ఇకారాన్తః నపుంసకలింగః, అక్షిశబ్దః, ష.ద్వి. 6. ఉచ్ఛ్వాసికాలాఞ్జనరాగమ్ – **...రాగమ్,** ...రాగే, ...రాగాని; నకారాన్త నపుంసకలింగ ...రాగశబ్దః, ద్వి.ఏ. 7. క్లాన్తయవావతంసమ్ – **...అవతంసమ్**, ...అవతంసే, ...అవతంసాని; అకారాన్త నపుంసకలింగః అవతంసశబ్దః, ద్వి.ఏ.

**సంధులు :–**

1. ...గ్రహణాత్ + బభూవ – గ్రహణాద్బభూవ – జశ్త్వసన్ధిః।
2. ఆర్ద్ర + అరుణ – ఆర్ద్రారుణ – సవర్ణదీర్ఘసన్ధిః।
3. కాల + అఞ్జన – కాలాఞ్జన – సవర్ణదీర్ఘసన్ధిః।
4. యవ + అవతంసమ్ – యవావతంసమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।

**సమాసాలు :–**

1. వధూముఖమ్ – వధ్వాః ముఖమ్ వధూముఖమ్। ష.త।
2. ఈషదార్ద్రారుణగణ్డలేఖమ్ – ఆర్ద్రే చ తే అరుణే ఆర్ద్రారుణే, ఈషత్ చ ఆర్ద్రారుణే ఈషదార్ద్రారుణే గణ్డయోః లేఖే గణ్డలేఖే, ఈషదార్ద్రారుణే గణ్డలేఖే యస్య తద్ ఈషదార్ద్రారుణగణ్డలేఖమ్। బహుర్వ్రీహిః।





3. ఉచ్ఛ్వాసికాలాఞ్జనరాగమ్ – కాలం చ తద్ అఞ్జనం కాలాఞ్జనం, తస్య రాగః కాలాఞ్జనరాగః, ఉచ్ఛ్వాసీ కాలాఞ్జనరాగః, యస్య తద్ ఉచ్ఛ్వాసికాలాఞ్జనరాగమ్, బహుర్వ్రీహిః।
4. క్లాన్తయవావతంసమ్ – యవానామ్ అవతంసః యవావతంసః, క్లాన్తః యవావతంసః యస్య తత్ క్లాన్తయవావతంసమ్। బహుర్వ్రీహిః।
5. ఆచారధూమగ్రహణాత్ – ధూమస్య గ్రహణం ధూమగ్రహణమ్, ఆచారేణ ధూమగ్రహణమ్ ఆచారధూమగ్రహణమ్, తస్మాత్ ఆచారధూమగ్రహణాత్। తృ.త.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. అవతంస :– (పుం / నపుం.) –**

ఎ) అవ + తంస్ + ఘఞ్। శేఖరః, శిరోభూషణమ్, కర్ణపూరః।

బి) శ్లో॥ కర్ణపూరేఽపి దృశ్యేతే తథోత్తంసావతంసకౌ ॥ 554

–అని హలాయుధకోశము '3' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ లవంగమాలాకలి**తావతంసా–**
స్తే నారికేళాంతరపః పిబంతః।
ఆస్వాదితార్ద్రక్రముకాస్సముద్రా–
దభ్యాగతస్య ప్రతిపత్తిమాపుః॥ – మాఘకావ్యే 3–81

2. రఘువంశమహాకావ్యమునగల **(7–27) శ్లోకమును** ఇట అనుసంధానము చేసికొనదగును. సాదృశ్యమధికము. చూడుడు.

శ్లో॥ తమఞ్జనక్లేదసమాకులాక్షం
ప్రమ్లానబీజాఙ్కురకర్ణపూరమ్।
వధూముఖం పాటలగణ్డలేఖ–
మాచారధూమగ్రహణాద్బభూవ॥

క్లాన్తయవావతంసమ్ – బీజాఙ్కురకర్ణపూరమ్
ఆర్ద్రారుణగణ్డలేఖమ్ – పాటలగణ్డలేఖమ్
ఉచ్ఛ్వాసికాలాఞ్జనరాగమ్ – అఞ్జనక్లేదసమాకులాక్షమ్.

**క్రియాదర్శము :– బభూవ** – 22వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడగలరు.

**అవతారిక :–** అథాచార్యః సహధర్మచరణముపదిశతి–

**శ్లో॥ వధూం ద్విజః ప్రాహ తవైష వత్సే!**
**వహ్నిర్వివాహం ప్రతి కర్మసాక్షీ**
**శివేన భర్త్రా సహ ధర్మచర్యా**
**కార్యా త్వయా ముక్తవిచారయేతి॥ 83**

**పదవిభాగము :–** వధూమ్, ద్విజః, ప్రాహ, తవ, ఏషః, వత్సే, వహ్నిః, వివాహమ్, ప్రతి, కర్మసాక్షీ, శివేన, భర్త్రా, సహ, ధర్మచర్యా, కార్యా, త్వయా, ముక్తవిచారయా, ఇతి।

**అన్వయక్రమము :–** (అథ) ద్విజః వధూం ప్రాహ – హే వత్సే। ఏషః వహ్నిః తవ వివాహం ప్రతి కర్మసాక్షీ, ముక్తవిచారయా త్వయా భర్త్రా శివేన సహ ధర్మచర్యా కార్యా, ఇతి।

**ప్రతిపదార్థము :–** (అథ – పిమ్మట), ద్విజః – పురోహితుడు, వధూమ్ – వధువగు పార్వతీదేవినిగుఱించి, ఇతి – ఈ విధముగ, ప్రాహ – పలికెను, హే వత్సే – ఓ బిడ్డా, ఏషః + వహ్నిః – ఈ అగ్నిహోత్రుడు, తవ వివాహమ్ ప్రతి – మీ వివాహమునకు, కర్మసాక్షీ – ప్రత్యక్షసాక్షి. ముక్తవిచారయా – ఇతరాలోచన రానీయనిదానవగు, త్వయా – నీచేత, భర్త్రా – భర్తయగు, శివేన సహ – శివునితో సమముగా, ధర్మచర్యా – ధర్మాచరణము, కార్యా – కార్యము.

**తాత్పర్యము :–** పిమ్మట, పురోహితుడు వధువగు పార్వతీదేవినిగుఱించి ఈవిధముగ పలికెను. 'ఓ బిడ్డా! ఈ అగ్నిహోత్రుడు మీ వివాహమునకు ప్రత్యక్షసాక్షి. ఇతరాలోచన రానీయని దానవగు నీచేత భర్తయగు శివునితో సమముగా ధర్మాచరణము కార్యము.

**పాఠాన్తరాలు :–** 1. కర్మసాక్షీ – పూర్వసాక్షీ.

**విభక్తులు / క్రియలు :–** 1. ద్విజః – **ద్విజః**, ద్విజౌ, ద్విజాః; అకారాన్తః పుంలింగో ద్విజశబ్దః ప్ర.ఏ. 2. వధూమ్ – **వధూమ్,** వధ్వౌ, వధూః; ఊకారాన్తః స్త్రీలింగో వధూశబ్దః, ద్వి.ఏ. 3. ప్ర – ఉపసర్గ. ఆహ – అవ్యయము – ఉవాచేత్యర్థః। పలికెను। 4. హే వత్సే – **హే వత్సే**, హే వత్సౌ, హే వత్సాః; ఆకారాన్తః స్త్రీలింగో వత్సాశబ్దః, సం.ప్ర.ఏ. 5. ఏషః – **ఏషః**, ఏతౌ, ఏతే; దకారాన్తః పుంలింగ ఏతచ్ఛబ్దః, ప్ర.ఏ. 6. వహ్నిః – **వహ్నిః**, వహ్నీ, వహ్నయః; ఇకారాన్తః పుంలింగో వహ్నిశబ్దః , ప్ర.ఏ. 7. తవ – **తవ / తే**, యువయోః / వామ్ – యుష్మాకమ్ / వః – ష.ఏ. 8. వివాహమ్ – **వివాహమ్**, వివాహౌ, వివాహాన్; అకారాన్తః పుంలింగో వివాహశబ్దః, ద్వి.ఏ. 9. ప్రతి – అవ్యయము 10. కర్మసాక్షీ – **కర్మసాక్షీ**, కర్మసాక్షిణౌ, కర్మసాక్షిణః; నకారాన్తః పుంలింగః కర్మసాక్షిన్శబ్దః, ప్ర.ఏ.



11. ముక్తవిచారయా – **ముక్తవిచారయా**, ముక్తవిచారాభ్యామ్, ముక్తవిచారాభిః; ఆకారాన్తః స్త్రీలింగో ముక్తవిచారాశబ్దః, తృ.ఏ. 12. త్వయా – **త్వయా,** యువాభ్యామ్, యుష్మాభిః, దకారాన్తః త్రిషులింగేషు సరూపః యుష్మచ్ఛబ్దః, తృ.ఏ.13. భర్త్రా – **భర్త్రా**, భర్తృభ్యామ్, భర్తృభిః; ఋకారాన్తః పుంలింగో భర్తృశబ్దః, తృ.ఏ. 14. శివేన – **శివేన**, శివాభ్యామ్, శివైః; అకారాన్తః పుంలింగశ్శివశబ్దః, తృ.ఏ. 15. సహ – అవ్యయము 16. ధర్మచర్యా – **ధర్మచర్యా**, ధర్మచర్యే, ధర్మచర్యాః; ఆకారాన్తః స్త్రీలింగో ధర్మచర్యాశబ్దః, ప్ర.ఏ. 17. కార్యా – **కార్యా,** కార్యే, కార్యాః; ఆకారాన్తః స్త్రీలింగః కార్యాశబ్దః, ప్ర.ఏ.

**సంధులు :–**

1. తవ + ఏషః– తవైషః – వృద్ధిసన్ధిః (వృద్ధిరేచి)
2. ఏషః + వత్సే – ఏష వత్సే – సులోపః।
3. వహ్నిః + వివాహమ్ – వహ్నిర్వివాహమ్ – విసర్గసన్ధిః।
4. ముక్తవిచారయా + ఇతి – ముక్తవిచారయేతి – గుణసన్ధిః। ఆద్గుణః।
5. ప్ర + ఆహ – ప్రాహ – సవర్ణదీర్ఘసన్ధిః।

**సమాసాలు :–**

1. కర్మసాక్షీ – సాక్షాద్ ద్రష్టా సాక్షీ కర్మణః సాక్షీ – కర్మసాక్షీ – ష.త।
2. ముక్తవిచారయా – ముక్తః విచారః యయా సా ముక్తవిచారా, తయా। బహువ్రీహిః।
3. ధర్మచర్యా – చరణం చర్యా, ధర్మస్య చర్యా ధర్మచర్యా – ష.త।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**



**1. వివాహః** – ఎ) అయం ప్రాజాపత్యవివాహో ద్రష్టవ్యః। యథాహ భగవాన్ మనుః।

సహోభౌ చరతాం ధర్మమితి వాచానుభాష్య చ।
కన్యాప్రదానమభ్యర్చ్య ప్రజాపత్యో విధిః స్మృతః॥ ఇతి – (3/30)

బి) 'సహధర్మం చరతమ్ ఇతి ప్రాజాపత్య' – ఇత్యాశ్వలాయనవచనాత్ (1–6–1)

సి) 'ఆదిత్యచన్ద్రావనిల' – ఇత్యాది....

**2. ఆహ –**

ఎ) ఉవాచేత్యర్థః – అవ్యయః బి) తిజ్ ప్రతిరూపకవ్యయమేతత్।

పఞ్చానాం బ్రువ ఆద్యానామాహాదేశః స్మృతో లటి।
ఆహేత్యేతదతీతే తిజ్ప్రతిరూపకమవ్యయమ్॥ ఇతి భోజః।

3. ఈ శ్లోకమువఱకు పార్వతీపరమేశ్వరులను వధూవరులుగా సంభావించిన మహాకవి కాళిదాసు ఇట మొదటిసారిగా **శివుని** భర్తగా సంబోధించినాడు.

---

**అవతారిక :–** పార్వత్యా గురోర్వచనం శ్రద్ధయా గృహీతమ్–

**శ్లో॥ ఆలోచనాన్తం శ్రవణే వితత్య**
**పీతం గురోస్తద్వచనం భవాన్యా।**
**నిదాఘకాలోల్బణతాపయేవ**
**మాహేన్ద్రమమ్భః ప్రథమం పృథివ్యా॥ 84**

**పదవిభాగము :–** ఆలోచనాన్తమ్, శ్రవణే, వితత్య, పీతమ్, గురోః, తత్, వచనమ్, భవాన్యా, నిదాఘకాలోల్బణతాపయా, ఇవ, మాహేన్ద్రమ్, అమ్భః, ప్రథమమ్, పృథివ్యా

**అన్వయక్రమము :–** భవాన్యా ఆలోచనాన్తం శ్రవణే వితత్య తద్ గురోః వచనం నిదాఘకాలోల్బణతాపయా పృథివ్యా ప్రథమం మాహేన్ద్రమ్ అమ్భ ఇవ పీతమ్।

**ప్రతిపదార్థము :–** భవాన్యా – పార్వతీదేవిచేత, ఆలోచనాన్తమ్ – కనులవరకు, శ్రవణే – చెవులను, వితత్య – నిక్కించి, తద్ – ఇంతకుముందు చెప్పిన, గురోః – పురోహితునియొక్క, వచనమ్ – వచనము, నిదాఘకాలోల్బణతాపయా – వేసవికాలమునందు మిక్కిలివేడికి గురియైన, పృథివ్యా – భూమాతచేత, మాహేన్ద్రమ్ – మహేన్ద్ర సంబంధమగు, అమ్భః + ఇవ – తొలకరిజల్లు స్వీకరించబడినట్లు, పీతమ్ – శ్రద్ధతో ఆలకింపబడినదయ్యెను.

**తాత్పర్యము :–** పార్వతీదేవి కనులవఱకు చెవులను నిక్కించి ఇంతకు ముందు చెప్పిన పురోహితునియొక్క వచనమును – వేసవికాలమునందు మిక్కిలివేడికి గురియైన భూమాతచేత మొట్టమొదటిదగు మహేన్ద్ర సంబంధమగు తొలకరిజల్లు స్వీకరింపబడినట్లు – శ్రద్ధతో వినెను.

**పాఠాన్తరాలు :–** 1. శ్రవణే – శ్రవణౌ; 2. వితత్య – వివృత్య.

**విభక్తులు / క్రియలు :–** 1. భవాన్యా – **భవాన్యా**, భవానీభ్యామ్, భవానీభిః; ఈకారాన్తః స్త్రీలింగో భవానీశబ్దః, తృ.ఏ. 2. ఆలోచనాన్తమ్ – 'ఆఙ్ మర్యాదాఽభివిధ్యోః' ఇత్యవ్యయీభావః। 3. శ్రవణే – శ్రవణమ్, **శ్రవణే**, శ్రవణాని; అకారాన్తః నపుంసకలింగః శ్రవణశబ్దః, ద్వి.ద్వి. 4. వితత్య – అవ్యయము 5. గురోః – **గురోః**, గుర్వోః, గురూణామ్; ఉకారాన్తః పుంలింగో గురుశబ్దః, ష.ఏ.





6. వచనమ్ – **వచనమ్**, వచనే, వచనాని; అకారాన్త నపుంసకలింగో వచనశబ్దః, ప్ర.ఏ. 7. నిదాఘకాలోల్బణతాపయా – **...తాపయా,** ...తాపాభ్యామ్, ...తాపాభిః; ఆకారాన్తః స్త్రీలింగో...తాపాశబ్దః , తృ.ఏ. 8. పృథివ్యా – **పృథివ్యా,** పృథివీభ్యామ్, పృథివీభిః; ఈకారాన్తః స్త్రీలింగః పృథివీశబ్దః, తృ.ఏ. 9. ప్రథమమ్ – **ప్రథమమ్**, ప్రథమే, ప్రథమాని; అకారాన్త నపుంసకలింగః ప్రథమశబ్దః, ప్ర.ఏ. 10. మాహేన్ద్రమ్ – **మాహేన్ద్రమ్**, మాహేన్ద్రే, మాహేన్ద్రాణి; అకారాన్త నపుంసకలింగ మాహేన్ద్రశబ్దః, ప్ర.ఏ. 11. అమ్భః – **అమ్భః**, అమ్భసీ, అమ్భాంసి; సకారాన్త నపుంసకలింగ అమ్భశ్శబ్దః, ప్ర.ఏ. 12. ఇవ – అవ్యయము 13. పీతమ్ – **పీతమ్,** పీతే, పీతాని; అకారాన్త నపుంసకలింగః పీతశబ్దః , ప్ర.ఏ.

**సంధులు :–**

1. గురోః + తత్ – గురోస్తద్ – విసర్గసన్ధిః।
2. ...తాపయా + ఇవ – తాపయేవ – గుణసన్ధిః।
3. లోచన + అన్తమ్ – లోచనాన్తమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।
4. కాల + ఉల్బణ – కాలోల్బణ – గుణసన్ధిః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. భవాన్యా – భవస్య పత్నీ భవానీ, తయా భవాన్యా। ('ఇంద్రవరుణభవ'...మానుక్' ఇతి జీష్ ఆనుగాగమశ్చ।)
2. ఆలోచనాన్తమ్ – లోచనస్య అన్తః లోచనాన్తః లోచనాన్తాద్ ఆ ఆలోచనాన్తమ్। 'ఆఙ్ మర్యాదాఽభివిధ్యోః' **ఇత్యవ్యయీభావః।**
3. నిదాఘకాలోల్బణతాపయా – నిదాఘస్య కాలః, నిదాఘకాలః, ఉల్బణః తాపః యస్యాః సా ఉల్బణతాపా, నిదాఘకాలే ఉల్బణతాపా నిదాఘకాలోల్బణతాపా, తయా నిదాఘకాలోల్బణతాపయా – స.త।
4. మాహేన్ద్రమ్ – మహాంశ్చాసౌ ఇంద్రః మహేన్ద్రః తస్య ఇదమ్ మాహేన్ద్రమ్। తద్ధితవృత్తిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. పృథివీ – పృథివిః – పృథవీ – (స్త్రీ.)**

ఎ) పృథవీ – 'ప్రథేః షివన్ సంప్రసరణం చ' ఇతి కస్యచిన్మతే షవన్, షి త్వాద్ జీష్। పృథ్వీ, భూమిః।

బి) పృథివిః – పృథివీ + జీషో వా హ్రస్వః। పృథివీ।

సి) పృథివీ – ప్రథతే విస్తారం యాతీతి। 'ప్రథేః షివన్ సంప్రసరణం చ' ఇతి షివన్ సంప్రసరణం చ, జీష్। భూమిః।

డి) 'స దధార **పృథివీం** ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ'

– ఇతి ఋగ్వేదే 10/121/1

'పృథివీత్యన్తరిక్షనామ' – ఇతి తద్భాష్యే సాయణాచార్యః।

ఇ) శ్లో॥ భూర్భూమిర్వసుధావనిర్వసుమతీ ధాత్రీ ధరిత్రీ ధరా
గౌర్గోత్రా జగతీ రసా క్షితిరిలా క్షోణీ క్షమా క్ష్మాచలా।
కుః పృథ్వీ **పృథివీ** స్థిరా చ ధరణీ విశ్వమ్భరా మేదినీ
జ్యానన్తా విపులా సముద్రవసనా సర్వంసహోర్వీ మహీ। 156

శ్లో॥ కాశ్యపీ భూతధాత్రీ చ రత్నగర్భా వసుంధరా।
ధరాధారా చ విజ్ఞేయా తద్విశేషాన్నిబోధత॥

– అని హలాయుధకోశము '37' నామములను పేర్కొన్నది.

**అలంకారాలు :–** అత్రోపమాలంకారః।'

---

**అవతారిక :–** భర్త్రా ప్రయుజ్యమానాయాః ధ్రువదర్శనం వర్ణయతి –

**శ్లో॥ ధ్రువేణ భర్త్రా ధ్రువదర్శనాయ**
**ప్రయుజ్యమానా ప్రియదర్శనేన।**
**సా దృష్ట ఇత్యాననమున్నమయ్య**
**హ్రీసన్నకణ్ఠీ కథమప్యువాచ॥ 85**

**పదవిభాగము :–** ధ్రువేణ, భర్త్రా, ధ్రువదర్శనాయ, ప్రయుజ్యమానా, ప్రియదర్శనేన, సా, దృష్టిః, ఇతి, ఆననమ్, ఉన్నమయ్య, హ్రీసన్నకణ్ఠీ, కథమ్, అపి, ఉవాచ।

**అన్వయక్రమము :–** ప్రియదర్శనేన ధ్రువేణ భర్త్రా ధ్రువదర్శనాయ ప్రయుజ్యమానా హ్రీసన్నకణ్ఠీ సా కథమపి ఆననమ్ ఉన్నమయ్య దృష్టః + ఇతి ఉవాచ।

**ప్రతిపదార్థము :–** ప్రియదర్శనేన – ప్రియదర్శనుడును, ధ్రువేణ – శాశ్వతుడును అగు, భర్త్రా – భర్తచేత, ధ్రువదర్శనాయ – ధ్రువనక్షత్రమును చూచుటకొఱకు,

105



ప్రయుజ్యమానా – ప్రేరేపింపబడినదియు, హ్రీసన్నకణ్ఠీ – లజ్జాహీన స్వరము కలదియు అగు, సా – ఆ పార్వతీదేవి, కథమపి – ఎటులనో, ఆననమ్ – ముఖమును, ఉన్నమయ్య – పైకి ఎత్తి, దృష్టః – 'చూచితిని'; ఇతి – అని, ఉవాచ – పలికెను.

**తాత్పర్యము :–** ప్రియదర్శనుడును, శాశ్వతుడును అగు భర్తయైన శివునిచేత ధ్రువనక్షత్రమును చూచుటకొఱకు ప్రేరేపింపబడినదియు, లజ్జా హీనస్వరము గలదియు అగు ఆ పార్వతీదేవి ఎటులనో ముఖమును పైకి ఎత్తి 'చూచితిని' అని పలికెను.

**విభక్తులు / క్రియలు :–** 1. ప్రియదర్శనేన – **ప్రియదర్శనేన**, ప్రియదర్శనాభ్యామ్, ప్రియదర్శనైః అకారాన్తః పుంలింగః ప్రియదర్శనశబ్దః, తృ.ఏ. 2. ధ్రువేణ – **ధ్రువేణ**, ధ్రువాభ్యామ్, ధ్రువైః; అకారాన్తః పుంలింగః ధ్రువశబ్దః, తృ.ఏ. 3. భర్త్రా – **భర్త్రా**, భర్తృభ్యామ్, భర్తృభిః; ఋకారాన్తః పుంలింగః భర్తృశబ్దః, తృ.ఏ. 4. ధ్రువదర్శనాయ – **ధ్రువదర్శనాయ**, ధ్రువదర్శనాభ్యామ్, ధ్రువదర్శనేభ్యః; అకారాన్తః పుంలింగో ధ్రువదర్శనశబ్దః, చ.ఏ 5. ప్రయుజ్యమానా – **ప్రయుజ్యమానా,** ప్రయుజ్యమానే, ప్రయుజ్యమానాః; ఆకారాన్తః స్త్రీలింగః ప్రయుజ్యమానాశబ్దః, ప్ర.ఏ. 6. హ్రీసన్నకణ్ఠీ – **హ్రీసన్నకణ్ఠీ,** హ్రీసన్నకణ్ఠ్యౌ, హ్రీసన్నకణ్ఠ్యః; ఈకారాన్తః స్త్రీలింగో హ్రీసన్నకణ్ఠశబ్దః, ప్ర.ఏ. 7. సా – **సా**, తే, తాః ; దకారాన్తః స్త్రీలింగస్తచ్ఛబ్దః, ప్ర.ఏ. 8. కథమ్, అపి, ఇతి – అవ్యయాలు 9. ఆననమ్ – **ఆననమ్,** ఆననే, ఆననాని; అకారాన్త నపుంసకలింగః ఆననశబ్దః, ద్వి.ఏ. 10. ఉన్నమయ్య – ల్యబన్తమవ్యయము 11. దృష్టః – దృష్టః, దృష్టౌ, దృష్టాః; అకారాన్తః పుంలింగో దృష్టశబ్దః, ప్ర.ఏ.

**సంధులు :–**

1. దృష్టః + ఇతి – దృష్ట ఇతి – విసర్గలోపః।
2. ఇతి + ఆననమ్ – ఇత్యాననమ్ – యణాదేశసన్ధిః।
3. అపి + ఉవాచ – అప్యువాచ – యణాదేశసన్ధిః।

**సమాసాలు :–**

1. ప్రియాదర్శనేన – ప్రియం దర్శనం యస్య సః ప్రియదర్శనః, తేన। బహుహ్రీహిః
2. ధ్రువదర్శనాయ – ధ్రువస్య దర్శనం ధ్రువదర్శనం, తస్మై ధ్రువదర్శనాయ। ష.త।
3. హ్రీసన్నకణ్ఠీ – సన్నః కణ్ఠః యస్యాః సా సన్నకణ్ఠీ (బహుహ్రీహిః) హ్రియా సన్నకణ్ఠీ హ్రీసన్నకణ్ఠీ – తృ.త।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ధ్రువమ్ :– (త్రి.) –**

ఎ) ధ్రు గతిస్థైర్యే + బాహులకాత్ క। శాశ్వతం, స్థిరం, సన్తతమ్.

బి) శ్లో॥ యో ధ్రువాణి పరిత్యజ్య అధ్రువాణి నిషేవతే।
ధ్రువాణి తస్య నశ్యన్తి అధ్రువం నష్టమేవ హి॥ – ఇతి చాణక్యశతకే.

సి) (పుం.) 1.. ధ్రువతి స్థిరీభవతీతి, ధ్రు + బాహులకాత్ క।
శఙ్కుః, వటః, **శివః।**

2. 'ధాతా శక్రశ్చ విష్ణుశ్చ మిత్రస్త్వష్టా ధ్రువో ధరః'।
– ఇతి మహాభారతే 13/17/303

డి) 'ధ్రువమరున్ధతీం సప్తర్షీనితి దృష్ట్వా వాచం విసృజేద్'
– ఇతి ఆశ్వలాయనగృహ్యసూత్రమ్ (1-7-22)

ఇ) 'ధ్రువో భభేదే క్లీబం తు నిశ్చితే శాశ్వతే త్రిషు' – అని అమరకోశము
మరిన్ని వివరములకు 'హలాయుధకోశ' వ్యాఖ్యను చూడగలరు.

2. ఉన్నమయ్య – ల్యబన్తావ్యయం of the causal form (ణిజన్త) of the root నమ్ with ఉత్.

**క్రియాదర్శము :–** ఉవాచ – ఇంతకుముందు చెప్పబడినది.

---

**అవతారిక :–** శాస్త్రవిహితం కర్మ పరిసమాప్య రూఢిప్రసిద్ధం లౌకికం కర్మ వర్ణయతి। తత్రాదౌ సకలపూజ్యస్య బ్రహ్మణః ప్రణామమాహ।

**శ్లో॥ ఇత్థం విధిజ్ఞేన పురోహితేన**
**ప్రయుక్తపాణిగ్రహణోపచారౌ।**
**ప్రణేమతుస్తౌ పితరౌ ప్రజానాం**
**పద్మాసనస్థాయ పితామహాయ॥** **86**

**పదవిభాగము :–** ఇత్థమ్, విధిజ్ఞేన, పురోహితేన, ప్రయుక్తపాణిగ్రహణోపచారౌ, ప్రణేమతుః, తౌ, పితరౌ, ప్రజానామ్, పద్మాసనస్థాయ, పితామహాయ।





**అన్వయక్రమము :–** ఇత్థం విధిజ్ఞేన పురోహితేన ప్రయుక్త...చారౌ ప్రజానాం పితరౌ తౌ పద్మాసనస్థాయ పితామహాయ ప్రణేమతుః।

**ప్రతిపదార్థము :–** ఇత్థమ్ – ఈవిధముగా, విధిజ్ఞేన – వివాహప్రయోగమును తెలిసినవాడగు, పురోహితేన – హిమవంతుని పురోహితునిచేత, ప్రయుక్తపాణిగ్రహణోపచారౌ – వివాహకర్మను పూర్తిచేయించుకొన్నవారు, ప్రజానామ్ – జగత్తునకు, పితరౌ తౌ – తల్లియు తండ్రియునగు ఆ పార్వతీపరమేశ్వరులు, పద్మాసనస్థాయ – పద్మాసనముపై కూర్చొనియున్న, పితామహాయ – పితామహుడగు బ్రహ్మదేవునకు, ప్రణేమతుః – నమస్కరించిరి.

**తాత్పర్యము :–** ఈవిధముగా వివాహప్రయోగమును తెలిసినవాడగు హిమవంతుని పురోహితునిచేత వివాహకర్మను పూర్తిచేయించుకొన్నవారు, జగత్తుకు తల్లియు తండ్రియునగు ఆ పార్వతీపరమేశ్వరులు పద్మాసనముపై కూర్చొనియున్న పితామహుడగు బ్రహ్మదేవునకు నమస్కరించిరి.

**విభక్తులు / క్రియలు :–** 1. ఇత్థమ్ – అవ్యయము 2. విధిజ్ఞేన – **విధిజ్ఞేన**, విధిజ్ఞాభ్యామ్, విధిజ్ఞైః; అకారాన్తః పుంలింగో విధిజ్ఞశబ్దః, తృ.ఏ. 3. పురోహితేన – **పురోహితేన,** పురోహితాభ్యామ్, పురోహితైః; అకారాన్తః పుంలింగః...పురోహితశబ్దః, తృ.ఏ. 4. ప్రయుక్త...ఉపచారౌ – ...ఉపచారః **...ఉపచారౌ**, ...ఉపచారాః; అకారాన్తః పుంలింగః... ఉపచారశబ్దః, ప్ర.ద్వి. 5. ప్రజానామ్ – ప్రజాయాః ప్రజయోః, **ప్రజానామ్**; ఆకారాన్తః స్త్రీలింగః ప్రజాశబ్దః, ష.బ. 6. పితరౌ – పితా, **పితరౌ**, పితరః; ఋకారాన్తః పుంలింగః పితృశబ్దః, ప్రథమాద్వివచనచాంతః। 7. తౌ – సః, **తౌ**, తే; దకారాన్తః పుంలింగః తచ్ఛబ్దః, ప్ర.ద్వి. 8. పద్మాసనస్థాయ – **పద్మాసనస్థాయ**, పద్మాసనస్థాభ్యామ్, పద్మాసనస్థేభ్యః అకారాన్తః పుంలింగః పద్మాసనస్థశబ్దః, చ.ఏ. 9. పితామహాయ – **పితామహాయ,** పితామహాభ్యామ్, పితామహేభ్యః; అకారాన్తః పుంలింగః పితామహశబ్దః, చ.ఏ. 10. ప్రణేమతుః – క్రియ + లిట్ – ప్ర.ద్వి.

**సంధులు :–**

1. ప్రణేమతుః + తౌ – ప్రణేమతుస్తౌ – విసర్గసన్ధిః।
2. పాణిగ్రహణ + ఉపచారౌ – పాణిగ్రహణోపచారౌ – గుణసన్ధిః।
3. పద్మ + ఆసనస్థాయ – పద్మాసనస్థాయ – సవర్ణదీర్ఘసన్ధిః।

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. విధిజ్ఞేన – విధిం జానాతీతి విధిజ్ఞః, తేన విధిజ్ఞేన, కప్రత్యయః।
2. ప్రయుక్తపాణిగ్రహణోపచారౌ – పాణేః గ్రహణం పాణిగ్రహణం, తస్య

ఉపచారః పాణిగ్రహణోపచారః, ప్రయుక్తః పాణిగ్రహణోపచారః యయోః తౌ ప్రయుక్తపాణిగ్రహణోపచారౌ। బహువ్రీహిః।

3. పితరౌ – మాతా చ పితా చ పితరౌ – 'పితామాత్రా' **ఇత్యేకశేషః।**

4. పద్మాసనస్థాయ – పద్మమేవ ఆసనమ్ పద్మాసనం, తస్మిన్ తిష్ఠతీతి పద్మాసనస్థః తస్మై పద్మాసనస్థాయ। స.త।

5. పితామహాయ – పితౄణాం పితా పితామహః తస్మై పితామహాయ। ష.త।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

**1. పితామహః – (పుం.) –**

ఎ) పితుః పితేతి। 'పితృవ్యమాతులమాతామహ – పితామహాః' ఇత్యత్ర 'మాతృపితృభ్యాం పితరి డామహచ్' ఇతి డా మహచ్। బ్రహ్మణి తు పితుః పితా జనకస్యాపి జనకః। పితౄణాం మరీచ్యాదీనాం పితృగణానాం పితా వా। బ్రహ్మ।

బి) శ్లో॥ యస్మాత్ **పితామహో** జజ్ఞే ప్రభురేకః ప్రజాపతిః।
బ్రహ్మాసురగురుః స్థాణుః మునిః కః పరమేష్ఠ్యథ॥

– ఇతి మహాభారతే 1-1-32

సి) శ్లో॥ పితా యస్య నివృత్తః స్యాజ్జీవేద్వాపి **పితామహః।**
పితుః స నామ సంకీర్త్య కీర్తయేత్ ప్రపితామహమ్॥

– ఇతి మనుః 3-221

డి) శ్లో॥ బ్రహ్మ స్రష్టా పరమేష్ఠీ ధాతా పద్మభూః సురజ్యేష్ఠః।
వేధా విధిర్విరిఞ్చో హిరణ్యగర్భః శతానన్దః॥

శ్లో॥ శంభుః స్వయంభూర్ద్రుహిణశ్చతుర్వక్త్రః ప్రజాపతిః।
**పితామహో** జగత్కర్తా విరిఞ్చిః కమలాసనః॥ 7

– అని హలాయుధకోశము '20' నామములను పేర్కొన్నది.

ఇ) శ్లో॥ పితాహమస్య జగతో మాతా ధాతా **పితామహః।**
వేద్యం పవిత్రమోంకార ఋక్సామయజురేవ చ॥

– అని భగవద్గీత 9-17

**క్రియాదర్శము :- ప్రణేమతుః** – ప్ర – ఉపసర్గ. ణమ(నమ్) ప్రహ్వత్వే, నమ్రత్వే, శబ్దే, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాదయః(1); లిట్ – ప్రథమపురుష ద్వివచనాంతః।

ప్రణణామ – **ప్రణేమతుః** – ప్రణేముః

---

**అవతారిక :-** విధాతా 'వీరప్రసవా భవ' ఇతి వధూముక్త్వా ఈశ్వరవిషయే ఆశాస్యాభావాత్ స్తిమితో బభూవ –

**శ్లో॥ వధూర్విధాత్రా ప్రతినన్ద్యతే స్మ**
**కల్యాణి! వీరప్రసవా భవేతి।**
**వాచస్పతిః సన్నపి సోఽష్టమూర్తౌ**
**త్వాశాస్యచిన్తాస్తిమితో బభూవ॥ 87**

**పదవిభాగము :-** వధూః, విధాత్రా, ప్రతినన్ద్యతే, స్మ, కల్యాణి, వీరప్రసవా, భవ, ఇతి, వాచస్పతిః, సన్, అపి, సః, అష్టమూర్తౌ, తు, ఆశాస్యచిన్తాస్తిమితః, బభూవ।

**అన్వయక్రమము :-** వధూః విధాత్రా 'హే కల్యాణి వీర ప్రసవా భవ' ఇతి ప్రతినన్ద్యతే స్మ। సః వాచస్పతిః సన్ అపి అష్టమూర్తౌ, తు ఆశాస్యచిన్తాస్తిమితః బభూవ।

**ప్రతిపదార్థము :-** వధూః – వధువగు పార్వతీదేవి, విధాత్రా – బ్రహ్మదేవునిచేత, (హే)కళ్యాణి – 'ఓ కల్యాణీ', వీరప్రసవా భవ – వీరుని ప్రసవించు దానివిగా అగుము. ఇతి – అని, ప్రతినన్ద్యతే స్మ – ఆశీర్వదింపబడినది. సః – ఆ బ్రహ్మదేవుడు, వాచస్పతిః సన్ అపి – వాగీశ్వరుడైనను, అష్టమూర్తౌ తు – శివునియందు, ఆశాస్యచిన్తాస్తిమితః – ఆకాంక్ష్యవిచారమందుడు వాడు, బభూవ – అయ్యెను.

**తాత్పర్యము :-** వధువగు పార్వతీదేవి – బ్రహ్మదేవునిచేత 'ఓ కల్యాణీ! వీరుని ప్రసవించుదానివిగా అగుము' అని ఆశీర్వదింపబడినది. ఆ బ్రహ్మదేవుడు వాగీశ్వరుడైనను శివునియందు ఆకాంక్ష్యవిచారమందుడువాడు అయ్యెను. (నిరీహుడైన శివుని ఆశీర్వదించుటకేమియు లేనందున అతనిని ఆశీర్వదించుటకుత్సాహింపలేదని భావము.)

**పాఠాన్తరాలు :-** 1. మూర్తౌ – మూర్తేః

**విభక్తులు / క్రియలు :-** 1. వధూః – **వధూః**, వధ్వౌ, వధ్వః; ఊకారాన్తః స్త్రీలింగో వధూశబ్దః ప్ర.ఏ. 2. విధాత్రా – **విధాత్రా,** విధాతృభ్యామ్, విధాతృభిః; ఋకారాన్తః పుంలింగో ధాతృశబ్దః,

